ఓ౩మ్

# బృహద్గీత

(బృహదారణ్యకోపనిషత్తుకు గేయరూపం)



డా॥ మసవ చెన్నప్ప



ప్రమీలా ప్రచురణలు
సికింద్రాబాదు
1997

# BRUHADGEETHA

(A poetic form of BRUHADARANYAKOPANISHAT) by

**Dr. M. Chennappa,** M A , M Phil , Ph D
Dept of Telugu, Osmania University, Hyd



ప్రచురణ సంఖ్య 6
ప్రథమ ముద్రణ నవంబర్, 1997
ప్రతులు వెయ్యి
వెల రూ 90/-



ముఖ చిత్ర రచన **శీలా వీర్రాజు**

ప్రతులకు

**ప్రమీలా ప్రచురణలు,**
12-11-1095/A,
వారాసిగుడా,
సికింద్రాబాదు - 500061 ✆ 7640508

**నవోదయ బుక్ హౌస్,**
3-3-865, ఆర్య సమాజ్ ఎదురు వీధి,
కాచిగుడా, హైదరాబాదు - 500027

**వైదిక సాహిత్య భండార్,**
ఆర్యసమాజం, సుల్తాన్ బజార్,
హైదరాబాదు - 500195 ✆ 4751656

**ఆర్ క్రిష్ణమూర్తి బుక్ సెల్లర్స్,**
ఆర్యసమాజ్ మందిరం,
సీతాఫల్‌మండి, సికింద్రాబాదు - 500061, ✆ 7615661

**ముద్రణ ·**

Mounika Print House,
1-4-27/71/187,P S Colony, Hyderabad-080
✆ 7530142

# అంకితం



కళాప్రపూర్ణ పండిత గోపదేవశాస్త్రి గారి

దివ్యస్మృతికి

# గోప దేవా !

ఆత్మ రూపమ్మైన వత్సము
యోగరూపమ్మైన రజ్జువు
చేత ప్రాణమ్మనెడి కొయ్యకు
కట్టగలిగిన గోపదేవా !

బ్రహ్మచర్యము విడిచి పెట్టక
ధర్మ గ్రంథము లెల్ల చదివియు
నిక్కమగు వేదాంతవిద్యను
తెనుగు జేసిన గోపదేవా !

ఋషి దయానందులకు శిష్యుడు
ముక్తిరాముడు, అతని శిష్యులు
మీరు, చెన్నప మీకు శిష్యుడు
ఎంత భాగ్యము గోప దేవా !

దినమునకు నాల్గేసి గంటలు
నాకు ఒక ఏడాది కాలము
ప్రేమతో వైశేషికాదులు
బోధ చేసిన గోపదేవా !

మీరు వ్రాసిన ఉపనిషద్వ్యా
ఖ్యానములు పరియించి, బృహదా
రణ్యకమ్మును గేయముగరచి
యించినాడను గోపదేవా !

తియ్యనగు గురుశిష్య బంధము
గుర్తుగా ఈ బృహద్గీతను
కూర్చి అంకిత మిచ్చు చుంటిని
స్వీకరింపుము గోపదేవా !

# నివేదనం

భారతీయ తత్త్వవేత్తలను ప్రధానంగా ఆకర్షించిన ఉపనిషత్తులలో బృహదారణ్యకం ముఖ్యమైంది దాన్ని స్వస్వరూపంతో గేయరూపంలో తీసుకొని రావడానికి చేసిన ప్రయత్నమే ఈ 'బృహద్గీత'. నా ఎరుకలో తెలుగులో ఇంత వరకు బృహదారణ్యకాన్ని ఒకేఛందస్సులో గేయరూపంలో ఏకధారగా రచించిన వారు లేరు ఈ గ్రంధ రచనకు నాకు స్ఫూర్తి నిచ్చిన వారు దార్శనికులు, కళా ప్రపూర్ణ పండిత గోపదేవ్ గారు శ్రీ నోముల స్వామిదాసుగారి ఇంటిలో వారుండగా నేను వారికి శిష్యుడినై షడ్దర్శనాలలో పూర్వ మీమాంస తప్ప మిగిలిన వాటిని ఒక ఏడాది కాలంలో అభ్యసించాను వారి దివ్య స్మృతికి ఈ 'బృహద్గీత' ను అంకితం చేస్తున్నాను సచ్చిదానందమూర్తి ఐన పరమేశ్వరుని పట్లగల విశ్వాసం, ఆర్షవాఙ్మయంతో గల పరిచయం 'బృహద్గీత' రచనకు దోహదం చేశాయి. బృహదారణ్యకోపనిషత్తును చదివినప్పుడు మౌలికంగా నేనెవరినో నాకర్థమైంది సృష్టికీ, పరమాత్మకూ సంబంధించిన యథార్థ జ్ఞానాన్ని ఆవిష్కరింపజేయడంలో బృహదారణ్యకాన్ని మించిన గ్రంథం మరోటిలేదు ఇందులో బహిరంగ చర్చ ద్వారా, బహిరంగ విచారణ ద్వారా, నిశితంగా నిష్పాక్షికంగా సత్యాన్ని నిగ్గుదేల్చే ప్రయత్నం జరిగింది సంస్కృతంలో గద్యరూపంలో ఉండి యాజ్ఞవల్క్యునిచే ఉపదేశింపబడిన ఈ ఉపనిషత్తును తెలుగులో గేయరూపంలో అవతరింపజేయడానికి నేనొక సంవత్సరం శ్రమించవలసివచ్చింది ఒక తెలుగు వాడిగా తెలుగు వారికి ఈ ఆధ్యాత్మిక గ్రంధాన్ని అందిస్తున్నందుకు నాకెంతో ఆనందంగా ఉంది

'బృహద్గీత' గ్రంధ ప్రచురణకు తమ సహకారాన్ని అందించిన సంస్థలకు, మిత్రులకు నేనెంతో ఋణ పడి ఉన్నాను. గ్రంథాన్ని వ్రాయడం కన్న ప్రచురించడం కష్టతరమైన కాలంలో ఆర్ష ధర్మ ప్రచారానికి అంకితమైన సీతాఫల్‌మండి ఆర్యసమాజం వారు ఎనిమిది వేల రూపాయల విరాళమిచ్చి గ్రంథం వెలుగులోకి రావడానికి అవకాశం కల్పించినారు. అందుకు వారికి నా కృతజ్ఞతలు సమర్పించుకొంటున్నాను ఆర్ష ధర్మం మూర్తీభవించిన డా॥ మీనపల్లి సంజీవరావు గారు ప్రేమతో మూడువేల రూపాయల విరాళం ఇవ్వగా, సౌజన్య మూర్తులు శ్రీ సి ఆర్.దివిజేందర్ రెడ్డి గారు రెండు వేల రూపాయలిచ్చారు వారికి నా కృతజ్ఞతలర్పిస్తున్నాను సుల్తాన్ బజార్ ఆర్య సమాజం వారు కూడా నా కోరికను మన్నించి రెండువేల రూపాయల విరాళం ఇచ్చారు వారికి నా కృతజ్ఞతలు ఇంకా ఈ గ్రంధ ప్రచురణ యజ్ఞంలో వ్యక్తిగతంగా విరాళాలు అందించి తమ దాతృత్వాన్ని ప్రదర్శించుకొన్న ప్రముఖ వ్యాపారవేత్తలు, పెద్దలు శ్రీ నోముల స్వామి దాసుగారికి, శ్రీ గుత్తికొండ పాండు గారికి, శ్రీ మాడి శెట్టి మల్లేశం (కొత్త గూడెం) గారికి, శ్రీ కోటికె లక్ష్మయ్య

(శ్రీ విద్యా బుక్ డిపో- సుల్తాన్ బజార్) గారికి, శ్రీ మలి పెద్ది భావనా ఋషి గారికి, శ్రీ పి రాజ నరసింహా రావు (విక్రమ్ ఆటోమొబైల్స్ - సికింద్రాబాద్) గారికి, శ్రీ జి బాలస్వామి (కిరణ్ చిట్ ఫండ్స్ - హైదరాబాద్) గారికి, శ్రీ పెండెం లక్ష్మినారా యణ గారికి, శ్రీ ఆర్ శ్రీరాములు గారికి నా కృతజ్ఞులు తెలుపుకొంటున్నాను ఈ సందర్భంగా హార్ధికంగానే కాక అర్థికంగానూ తమ సహకారాన్ని అందించిన ఆత్మీయమిత్రులు శ్రీ ఉప్పల యాదగిరి గారికి, శ్రీ మెక్కొండ గోవర్ధన్ గారికి, శ్రీ శ్రీ నివాస శెట్టిగారికి, శ్రీబొల్ల విజయకుమార్ గారికి శ్రీరావికంటి రాందేవ్ గారికి , శ్రీ కె వెంకటేశ్ గారికి, డా॥ ఏ పాండేశ్వర రావు గారికి, శ్రీ మంచాల ప్రసాద్ (అడ్వొకేట్) గారికి, నా సహచరులు శ్రీ చంద్రగిరి యెల్లయ్య గారికి కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను

ఈ గ్రంథానికి తమ అమూల్యమైన పరిచయ వాక్యాలను కూర్చిన శ్రీ ఆరమండ్ల వెంకయ్యార్య (తెనాలి) గారికి, 'బృహద్గీత' తెలుగు వారికి ' ఇష్టసిద్ధి' కారకమని అభినందించిన '' సాహిత్య బ్రహ్మ'' డా॥ వి వి ఎల్ నరసింహారావు గారికి గ్రంథాన్ని ఆమూలాగ్రం పరిశీలించి చక్కని పీఠికను రచించిన మాన్య కవి మిత్రులు, సహాధ్యాపకులు డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి, గ్రంథం మొదలు పెట్టినప్పడి నుండి చివరి వరకు అనుంగుసో దరునివలె తన తోడ్పాటును అందించి, అభినందనలు తెలిపిన, వేద విజ్ఞాన వేదిక కన్వీనర్ వేదధర్మప్రచారకులు శ్రీ ఏ విశ్వేంద్ర ఆర్య గారికి నాకృతజ్ఞతలు అర్పించు కొంటున్నాను. గ్రంథప్రచురణకు సంబంధించి ఎప్పటికప్పుడు తగిన సూచనలను అందించిన పెద్దలు శ్రీ రావికంటి కృష్ణమూర్తి గారికి ప్రత్యేకంగా నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను

ఈ గ్రంథానికి చక్కని ముఖపత్ర రచన చేసిన శ్రీ శిలా వీర్రాజు గారికి, అందంగా ముద్రించి ఇచ్చిన **''వరౌనికా ప్రింట్ హౌజ్''** అధినేత నాబావమరిది శ్రీ ఆర్ సంతోష్ కుమార్ గారికి నా కృతజ్ఞతలు

గ్రంధ రచనాకాలంలో నాకత్యంత తోడ్పాటు నందించిన నా శ్రీమతి ప్రమీలకు, నా చిరంజీవులు క్రాంతి, శ్రావణి, ప్రణవ్‌లకు నా అభినందనలు

ఇప్పుడు 'బృహద్గీత' తెలుగు భాషాభిమానుల చేతుల్లో ఉన్నది దీన్ని తప్పక ఆదరిస్తారనే నమ్మకంనాకున్నది

**- డా॥ మసన చెన్నప్ప**

సాహిత్య బ్రహ్మ'
డా॥ వి వి ఎల్ నరసింహారావు
డైరెక్టర్, నేషనల్ ఓపెన్‌స్కూల్స్, భారతప్రభుత్వం

హైదరాబాద్
8-11-1997

# ఇష్ట సిద్ధి

భారతీయ సంస్కృతికి ప్రాణభూతమైనది వేద వాఙ్మయం. వేద పారమ్యం వేదాంతం. అది జ్ఞానకాండకు సంబంధించిన ఉపనిషత్తు ప్రసిద్ధమైన పది ఉపనిషత్తుల్లో బృహదారణ్యకం విశిష్టమైంది దీనిని తెనిగించవలసిన రీతిలో తెనిగించిన ధీశాలి డా॥ మసన చెన్నప్పగారు.

గానయోగ్యమైన ఉపనిషన్మంత్రాన్ని పాడి వచనంలో తెనిగించటం భావ్యంకాదు. ఈ ఔచిత్యం తెలిసిన డా॥ చెన్నప్ప దీన్ని ఛందోబద్ధంగానే అనువదించారు. అందునా పరమగాన యోగ్యమై, చతుర్దశమాత్రా సంఘటితమైన ముత్యాల సరం ఛందస్సులో

'బృహదారణ్యకం' చెన్నప్ప గళంలో 'బృహద్గీత' గా ప్రతిధ్వనించింది విశ్వహయం ఆస్కందితాది గతి పంచకంతో నాట్యం చేసింది చెన్నప్పవాణి ' ఉద్గాత' గా గుఱ్ఱాన్ని దౌడుతీయించింది బృహదారణ్యక యానంలో అయిదధ్యాయాలుగడచి, ' ప్రాణేంద్రియ సంవాద' రూపమైన షష్ఠాధ్యాయంలో ప్రాణప్రతిష్ఠ చేయించింది

డా॥ చెన్నప్ప తెలుగువారి గుండెల్లో జ్ఞానరూపమైన ఉపనిషత్సంస్కృతికి ప్రాణప్రతిష్ఠ చేశారు

ఇది ఒక మహాయజ్ఞం లోకహితమైన యజ్ఞాన్ని వైదిక పరిభాషలో ' ఇష్ట' మంటారు. ఇక్కడ అది అక్షరాలా సిద్ధించింది

డా॥ చెన్నప్ప 'బృహద్గీత' తెలుగువారికి 'ఇష్టసిద్ధి' కారకం. అస్తు!

**– వి.వి. ఎల్. నరసింహారావు**

# బృహద్గీతం - సుహృద్దర్శనం

బృహదారణ్యకోపనిషత్తు తెలుగులో బృహద్గీతగా అవతరించింది ఎంత కాలానికి ఇంత మంచిపని జరిగింది ఇంత మంచి పని చేసిన కవిమిత్రులు డా॥ మసన చెన్నప్పగారికి అభినందనం

మహర్షిదయానందుల (1824-1883) సత్యార్థ ప్రకాశం భారతీయ ఆర్షవిజ్ఞాన ప్రచారానికి వెన్నెముకలా నిలిచింది వారి బోధలు మంత్రాలు' వాటికి యంత్రంగానిలిచింది ఆర్యసమాజం యంత్రాంగం లేక పోతే మంత్రాంగం గ్రంధంలోనే ఉండిపోతుంది ఆ యంత్రాంగమే భారత స్వాతంత్ర్యోద్యమంలో తన వంతు బాధ్యత నిర్వర్తించింది స్వతంత్ర భారతంలో, ఈ ఏబై సంవత్సరాలలో కూడా ఆ యంత్రాంగంలోని మంత్రులూ, మేధావులూ, కార్యకర్తలూ వేదాలనూ, ఉపనిషత్తులనూ, దర్శనాలనూ, శాస్త్రాలనూ దయానందుని సనాతన ధర్మ మార్గంలో ప్రచారం చేశారు. చేస్తున్నారు. ఆమార్గంలో పయనించడానికి డా॥ మసనచెన్నప్పగారికి కళా ప్రపూర్ణ పండిత గోపదేవ్ గారి గురుత్వం లభించడం అదృష్టం తెలుగు వంతుళ్ల పూర్వసంప్రదాయ ప్రభావం లేకుండా ఆధ్యాత్మిక గురువుగా ఒకరిని స్వీకరించడానికి అంతతొందరగా అంగీకరించరు ఏ సమయంలో బీజావాపనం జరిగిందో కాని తెలుగులో ఆర్ష విజ్ఞానం, ఈ మిత్రునివల్ల సాహిత్య గంధాన్ని పులుముకొని జనాన్ని పరివేష్టించే భాగ్యానికి నోచుకొంది

ఇదొక యజ్ఞం 'ఇదం నమమ' ( ఇది నా కొరకు కాదు) అని ఇందులోకి దిగారు వీరు ఎవరికొరకు ఈ నిష్కామకర్మ? మొదటైతే తెలుగు వారి కొరకు, తరువాత భారతీయుల కొరకు, ఆ తర్వాత విశ్వమానవుల కొరకు ఆయాభాషల్లో ఇలాంటి వారెందరో ఆర్యసమాజ మాధ్యంగా, విద్యాలయాల మాధ్యంగా, ఆశ్రమాల మాధ్యంగా, ఉత్సవాల మాధ్యంగా ఈ పనికి ఇప్పటికే పూనుకొన్నారు కాబట్టి అవకాశవాద అధికార వాద అర్థ వాద భోగవాద ప్రపంచంలో సంస్కారాలు నాటే ప్రయత్నంవేగాన్ని పుంజుకొన్నదనే చెప్పాలి ఇంత అధ్యయన నేపథ్యంలో '' ఇది ఇంత మంచి పని'' అన్నాను అందుకే

**ఇవి ముత్యాల స్వరాలు:**

ఎన్నో గ్రంధాలు వ్రాసిన పండిత గోపదేవ్ గారు ఉపనిషత్తులన్నిటినీ నిరుక్తం ఆధారంగా, శాస్త్రాల ప్రమాణంతో తెనిగించారు సామాన్యునికి అందుబాటులో ఉండాలని 'రు వచనంలోనే అందించారు. విచిత్రమేమంటే వారు కొన్ని పద్యాల్లో ఉపనిష ద్వాణిని నిపించారు కొందరు ఆర్ష విజ్ఞాన ప్రచారానికి గేయప్రక్రియను స్వీకరించినప్పటికీ మొత్తం .గయాల్లో ఉపనిషత్తులలో కెల్ల పెద్దదయిన బృహదారణ్యకాన్ని ప్రచురించడం ప్రప్రథమంగా డా॥ చెన్నప్పగారే చేశారు. బృహదారణ్యకానికి వేలపుటల వ్యాఖ్యానాలతో, సంప్రదాయ పౌరాణిక పండితు లెందరో గ్రంధాలు ప్రచురించారు ఒకే కథగా సంవిధానం చేసి అందించిన

వారున్నారు చిన్న చిన్న కథలుగా ప్రకటించిన వారూ ఉన్నారు కాని తెలుగులో మిశ్రగతిలో అదీ ముత్యాలసరాలలో ఎత్తుకొన్న మొదటి రచయిత డా॥ చెన్నప్ప గారే అని చెప్పాలి జాతీయోద్యమానికి గేయం అందించిన యోగదానం మరువరానిది అంతకు పూర్వంభక్తి సంప్రదాయంలో గేయం విరాడ్రూపంధరించిందన్న సంగతి అందరికీ తెలిసిందే

ఈ బృహద్గీత నిండా 1200 గేయాలు ఉన్నాయి ప్రతి గేయం నాలుగు పాదాలతో 3+4 మిశ్రగతి మాత్రాగణాలతో నడుస్తుంది 4వపాదం తొమ్మిది నుండి 14 మాత్రల వరకుండ వచ్చని ఛందశ్శాస్త్ర వేత్తల అభిప్రాయం ఈ గ్రంథంలో 4వ పాదంలోకూడా 14 మాత్రల నియమమే రచయిత పాటించారు యతి ప్రాసల ప్రాకులాట లేకుండా బృహదారణ్యకం భావాన్ని అందించడానికే రచయిత ప్రయత్నించారు అయితే మిశ్ర గతి ఛందశ్శాస్త్రంలో క్రొత్తదేంకాదు నవవిధ రగడల్లోని హరిణగతి, వృషభగతి రగడలు రెండూ మిశ్రగతి లోనే నడుస్తాయి హరిణగతికి రెట్టింపే వృషభగతి ఇది ఆధునిక గేయ కవిత్వంలో ముత్యాలసరంగా సింగారించుకొన్న తొలిదశలో ఒక్క నాలుగో పాదందప్ప మిగతావన్నీ అంత పకడ్బందీగా కవులు పాటించారు ఆ తర్వాతి వారు భావానికి ప్రాధాన్యమిచ్చి సడలింపులు చేసుకొన్నారు

ఆపద్ధతిలో వేద స్వరాలను ముత్యాలసరాల్లో పలికిస్తున్నారు డా॥ చెన్నప్పగారు వేదంలో స్వరానికెంతో ప్రాధాన్య ముంటుంది సుస్వరంగా తెలుగు ముత్యాల సరాలను ముత్యాల స్వరాలుగా పలికించారు వీరు

'' అధికురాలగు వాణి 'బృహతీ' –వాణికిని భర్తగుట చేతను
ప్రాణదేవతయగు 'బృహస్పతి' – ప్రాణమే కద బ్రోచె వాణిని,'' (1–3–49)

'' ప్రాణమే 'ఉద్గీథ' మనబడు – వాణి 'గీథా' ప్రాణమే 'ఉత్'
ప్రాణశక్తికి నిలిచి సర్వము – పరమ పురుషుని కొలుచుచుండును ''(1–3–51)

ఈ పై గీతాలలోని ''బృహతీ, బృహస్పతి, ఉద్గీథ, గీథా, ఉత్'' అనే పదాల్ని అదేవిధంగా ప్రయోగించడంలోనే రచయిత స్వరాన్నీ – అర్థాన్నీ పట్టుకొన్నట్లే అర్థమవుతుంది. ఆర్యసామాజికులు స్వరాన్ని వదలి వేసి అర్థాన్నే పట్టు కొన్నారన్న విమర్శ ఉన్నది. కాని అది ఉచ్చారణలో తెలిసేదేగాని వ్రాతలో తెలియదు కొన్ని సాంకేతిక పదాలు అలాగే ప్రయోగించినపుడు ఆ ఉచ్చారణనూ పాటించినట్లే అవుతుంది శ్రీ చెన్నప్పగారు అలా పాటించారనడానికి పై పదాలున్న మూలాంశాలే ప్రమాణాలు

'' ఏష ఉఏవ బృహస్పతిః, వాగ్వై బృహతీ,
తస్యా ఏషపతిః, తస్మాదు బృహస్పతిః'' (1-3-20)

'' ఏష ఉవా ఉద్గీథః, ప్రాణోవా ఉత్, ప్రాణేనహీదం సర్వముత్తబ్ధం,
వాగేవ గీథా చేతి స ఉద్గీథః'' (1-3-23)

అర్థయుక్తంగా ఉన్న సాంకేతిక పదాలను వదలకుండా, భావానికి పరమ ప్రాధాన్యమిచ్చి, మిశ్ర గతి లయ చెడకుండా, ముత్యాల స్వరాలుగా అందించి, ఆధునిక తెలుగు గేయసాహిత్యానికి శాస్త్ర మర్యాదలు నేర్పారు, అందచందాలు సంతరించారు తాత్త్విక పరిమళాల పూతలు పూశారు

## గతినిమిత్తం తొక్కిన జానపదపథం :

వ్యాకరణ శాస్త్రానికీ ఛందశ్శాస్త్రానికున్న మర్యాదలన్నింటినీ రచయిత పాటిస్తానే, గతినిమిత్తం జానపదుల రాగాలలో పాటించే పద్ధతులుకొన్ని అనుసరించారు '' నేను చూసీ వచ్చినానే – నిమ్మాకిందీ సుందారీని '' ఈ పాదంలోని ''సీ, చీ, మ్మా, దీ, దా'' అనే దీర్ఘాక్షరాలు రాగం నిమిత్తం దీర్ఘమైనవే తప్ప, లక్షణశాస్త్రం ఆ దీర్ఘాలను లేదా వాటి గురుత్వాన్ని అంగీకరించదు అయితే ఇది చిఱుతల బాణి రచయిత వీటికి దీర్ఘాలు పెట్టకున్నా, ప్రదర్శనలో గాయకుడు దీర్ఘాలు తీస్తాడు లేకపోతే పదానికి, హార్మోనియంకు, తాళానికి సరిగా దరువు పడని పరిస్థితి ఏర్పడుతుంది జానపదుల ప్రదర్శన గీతాల్లో ఇది తప్పదు జానపదుల్లో పుట్టి జ్ఞానపదుల్లో అడుగుపెట్టిన మా చెన్నప్ప పై ఆదీర్ఘాల ప్రభావమూ ంది ఉదాహరణకు

శిరముషస్సూ (1-1-1), ఇసుకా (1-1-3), ప్రొద్దు పొడుపూ (1-1-4) ులు రేలూ (1-1-6), విశ్వహయమూ (1-1-7), లయమొనర్చీ (1-2-1) ులకొసగీ (1-3-43) పశువు, శిశువూ (1-4-60), బ్రహ్మ సృష్టీ (2-4-33) ుదలైన పదాల అంతంలోని దీర్ఘాలన్నీ ఈ విధంగా వచ్చి చేరినవే ఆకలేసీ (ఆకలి + ేసి) లాంటి ఆధునిక రూపాలు కూడా అక్కడక్కడ కనిపిస్తాయి అయితే చేప్పే భావాన్ని ొత్తి (stress) చెప్పాలన్న ఉద్దేశ్యంతోనే, అలా చెబితే గాని ఊపురావడం లేదన్న దృష్టితోనే ఈ మర్యాదోల్లంఘనలు చేశారని భావించవలసి వస్తుంది పైగా ఈ దీర్ఘాలకు ''నెనరూ ్యాయం విడనాడీ'' గురజాడ వారే ఎప్పుడో ముడివేస్రీ ఇదంతా ఆధునిక వ్యావహారికభాషా ్యాసం అనుకొంటే అసలు పేచేలేదు

## అనువాదం – అద్భుతం

అనువాదంలో తాము ఆశించిన పిండితార్థాన్ని తీసుకొని రావడానికి రచయిత బృహద్ ప్రయత్నమే చేశారు పడ్డతపనకూ చేసిన తపస్సుకూ వచ్చిన ఫలితం అద్భుతం మూలం– అనువాదం పరిశీలించండి –

. . ''యోవై స ధర్మః సత్యం వై తత్, తస్మాత్ సత్యం వదన్త మహుః, ధర్మంవదతీతి, ధర్మంవదన్తం సత్యం వదతీతి, ఏతద్ధ్యేవై తదుభయం భవతి '' (1-4-14)

''సత్యమే ధర్మమ్ము, ధర్మమె - సత్యమని భావింప వలయును
సత్యమును వచియించువానిని - ధర్మపరుడని యెంచవలయును '' (1-4-40)

అర్థంకాని విషయాన్ని అర్థంచేసుకోలేని కొందరు 'అదో బ్రహ్మపదార్థంరా బాబూ' అంటుంటారు అంతటితో ఆ చర్చను ముగిస్తారు అది శాస్త్రాంశంకానీ, లౌకికాంశంకానీ ఇలా అని తలపట్టుకొంటారు లేదా విషయాన్ని త్రుంచేస్తారు, కాకపోతే లేచి ఎక్కడి వాళ్ళక్కడ వెళ్లిపోతారు ఇంత తేలికగా తీసిపార వేసే వాళ్లు పుట్టుకొని వస్తున్న కారణంగా భారతీయ తాత్త్వికాంశాలు చులకనకు గురవుతున్నాయి తనతో వాదిస్తున్న కహోలునితో పండు ఒలిచి చేతిలో పెట్టినట్లు, యాజ్ఞవల్క్యుడు బ్రహ్మన్ని గురించి ఏమన్నాడో చూడండి !

'' ఓకహోలా వినుము నీలో - ఉన్న ఆత్మయె ఉన్న దందరి
లోన, దానిని నిశ్చయమ్ముగ - బ్రహ్మమని తెలియంగ వలయును '' (3-5-2).

ఇది పరమాత్మ తత్త్వవిచారణలో తేల్చి చెప్పిన మాట హృదయం, ప్రాణం, మనస్సు, ఆత్మ, బ్రహ్మం అనే సాంకేతిక పదాలకు నిరుక్తాన్ని ఆధారంగా తీసుకొని అర్థాలు గ్రహిస్తే వేదోపనిషత్ విజ్ఞానం సులభంగా అర్థమవుతుంది యాస్కుణ్ణి వదలి పెట్టి, ఎవరి సంప్రదాయానికి అనుగుణంగా వాళ్ల అర్థం చెప్పుకొనే పరిస్థితి ఏర్పడిన కారణంగానే భారతీయతత్త్వశాస్త్రం కొందరికి తల దూర్చడానికి వీలులేని కీకారణ్యమైపోయింది. ఆధునిక కంప్యూటర్ విజ్ఞానానికి ప్రత్యంశంలోనూ ''కీ'' ఉంటుంది ఆర్ష విజ్ఞానానికి షట్ శాస్త్రాలు - నిరుక్తం ''కీ'' లాంటివి ఈ బృహద్గీత అధ్యయనం చేసేప్పుడు కూడా అది మరచి పోరాదు

అనువాదంలోనూ దిశాదర్శనం చేయాలనే ఉద్దేశ్యంతో కొన్ని చోట్ల మూలంలో లేని అభిప్రాయాలను కూడా రచయిత చేర్చారు. ఈ క్రింది అనువాదం చూడండి

''పుత్తనగ పూర్ణమ్ము సేయుట - 'త్రః' యనగ రక్షించుటర్థము
కాని పుం నరకమ్ము కలదని - కల్లలాడుట సాహసమ్మగు '' (1-5-68)

మూలం (1-5-17) లోని వచనంలో పై గేయంలోని ఉత్తరార్థంలేదు పౌరాణికుల ప్రవచనాల్లోనూ, ఆయా సాంప్రదాయికుల అర్థాల్లోనూ వినిపించే భావం సరియైంది కాదని తెలుపడానికే రచయిత ఈ విమర్శను జత చేశారు ఇలాంటివి ఈ గేయాల్లో ఒకటి రెండు చోట్ల తప్ప ఎక్కువగాలేవు

## ఇంతకూ ఏమిటి ఈబృహదారణ్యకం ?

ఉపనిషత్తులన్నింటిలోనూ బ్రహ్మవిజ్ఞానమే ప్రధానంగా ఉన్నదన్న సంగతి అందరికీ తెలిసిందే అయితే ఆరు అధ్యాయాలున్న బృహదారణ్యకం 415 గద్యాలలో విస్తరించింది. ఇందులో సృష్టి, మృత్యువు, ప్రాణం, బ్రహ్మం, మధువిద్య అనే అంశాలు ప్రధానంగా ఉన్నాయి

జనకుని ఆస్థానంలో ఎందరెందరో అడిగిన ప్రశ్నలకు యాజ్ఞవల్క్యుడు చెప్పిన సమాధానాలే ఇందులో ఎక్కువగా కనిపిస్తున్నాయి ఆ సందర్భంలో యాజ్ఞవల్క్యుడు సత్యకామాది మహర్షుల అనుభ వాలివి అనికూడా ఒక్కోసారి చెబుతాడు గార్గ్యుడు, అజాతశత్రుడు, మైత్రేయి, జనకుడు, అశ్వలుడు, ఆర్తభాగుడు, భుజ్యుడు, చాక్రాయణుడు, గార్గి, ఉద్దాలకుడు, విదగ్ధుడు, కాత్యాయని, శ్వేత కేతువు, జైబలిపుత్రుడు, గౌతముడు... ఇలా ఎన్నో పాత్రలు వస్తాయి పరోక్షంగా - ప్రాస్తావికంగా వచ్చే ప్రజాపతి, సత్యకామాదులింకా ఉండనే ఉన్నారు

మధ్యన ఉన్న కథలు పరమరమణీయంగా హృదయంలోకిచొచ్చుకుపోతూ బ్రహ్మతత్త్వం వైపుగా శిష్యుణ్ణీ, పాఠకుణ్ణీ ప్రగమింపజేస్తాయి ఓ కథలో ప్రజాపతి, దేవ మానవ రాక్షసాళికి ఉపదేశం చేస్తాడు ముగ్గురికీ 'ద' అనే అక్షరాన్నే ఉపదేశిస్తాడు దేవతలు దమనమనే అర్థాన్ని, మానవులు దానమనే అర్థాన్ని, రాక్షసులు దయ అనే అర్థాన్ని గ్రహిస్తారు. ఆవిధంగా జీవించడం వల్ల వారు ఉత్తములవుతారన్నమాట.

ఇక ఈ అనువాదంలో చెప్పుకోదగ్గ మరోకథ ప్రాణేంద్రియ వివాదం (పుటలు 179–184). ఇది గేయాలన్నిట్లో హైలైట్ ఎంత బాగాకుదిరిందో ! చదివితీరవలసిందే. ఏది జ్యేష్ఠం, ఏది శ్రేష్ఠమని ప్రాణంతో పాటు ఇంద్రియాలన్నీ పోటీ పడ్డాయి వాణికన్నా, కన్నుల, చెవులకన్నా, మనస్సు కన్నా - ప్రాణమే శ్రేష్ఠమని తేలిపోయింది. ఏదిపోయినా పనులుజరుగుతూనే ఉన్నాయి కాని ప్రాణం పోవడానికి ప్రయత్నించిందో లేదో, ఇంద్రియాలన్నీ తల్లడిల్లినై .

'' నీవుపోవద్దు, శ్రేష్ఠుడవీవే , ఇక్కడే వర్ధిల్లు'' అని వేడుకొన్నాయి

'' ప్రాణమే శ్రేష్ఠమ్ము, జ్యేష్ఠము - ప్రాణమే మహనీయ సంపద
లోక మందు ప్రతిష్ఠ ప్రాణమె - ప్రాణమే ఆయతన మన్నియు''(6-1-30)

ఈవిధంగా జీవితంలో గుర్తించి వ్యవహరించే అనేకానేక ఉత్తమాంశాలీ గ్రంథంలో న్నాయి. అధ్యయనానుశీలనాల ద్వారా అన్నీ అనుష్ఠింపదగ్గవే అన్న నిర్ణయానికి అందరూ వస్తారు

## లౌకిక సందేశాలూ ఉన్నాయ్ !

'' అ యితే ఆధునిక కాలంలో పారమార్థిక దృష్టి తగ్గి లౌకిక దృష్టి అధికంగా కనిపిస్తున్నది కదా ! ఆ దృష్టితో అధ్యయనం చేసే వారికి బృహదారణ్యకం ఏం సందేశమిస్తుంది'' అని అడిగేవారున్నారు ''మనుర్భవ'' - ''మనిషివికమ్ము '' అని వేదమన్నది మనుష్యదృష్టితో వ్యవహరించు అనే ఆర్య సమాజం చెబుతున్నది డా॥ చెన్నప్పగారి దృష్టికూడా అదే ఈ క్రింది సందేశాలు చూడండి !

**జీవించే పద్ధతి**

పరులకివ్వక ఎవడుతినునో - వానికెన్నడు తృప్తి తీరదు
తాను తింటూ పరులకొసగీ - బ్రతుక నేర్చిన వాడె ధన్యుడు (1-3-43)

**ప్రేమ పోషణ ;**

ప్రాణమెట్టుల ఇంద్రియమ్ముల - చేరదీయుచు భోగమొసగునొ
మనుజుడట్టుల తోటివారిని - ప్రేమతో పోషింప వలయును (1-3-44)

**విజయసిద్ధి :**

సత్తునొందు మసత్తు విడిచియు - జ్యోతి గనుము తమస్సు దొరగియు
అమృతమానుము మృతినిగడచియు - అప్పుడే విజయమ్ము నీకగు (1-3-57)

**మూర్ఖుడు ;**

గొప్పవాడను నేను కానను - న్యూనభావము గలిగి ఎవ్వడు
బ్రతుకు నీడ్చునొ, అతడు ముప్పది - మూడు దేవతలందు మూర్ఖుడు (1-4-29)

ఇలాంటివి మరొక వంద చూపించవచ్చు కాని ఈ ఉపోద్ఘాతం బంగాళాఖాతమవుతుంది అందుకే 1-5-55,56, 57ల్లో ఇచ్చిన మనుజలోక, పిత్రులోక, దేవలోకాల అర్థాలు గ్రహించండి ! ఆవిధంగా వ్యవహరించండి ! జీవితం ధన్య మవుతుంది. భారతీయ యజ్ఞ సంస్కృతిలోని '' ఇదం న మమ'' ( ఇదినాకొరకు కాదు) అంతరార్థం అవగతమవుతుంది కవిమిత్రులూ ఆత్మీయులు డా॥ మనన చెన్నప్పగారు ఈ సంస్కృతిలో తాను నడుస్తూ పదిమందిని తనతో నడిపించుకొని పోవాలని ఎందుకు తపన పడుతున్నారో తెలిసివస్తుంది అందుకే ''సంగచ్ఛధ్వం, సంవదధ్వం, సంవోమనాంసి జానతమ్'' (ఋగ్వేదం)''ఒకే బాటలో కలిసినడవండి ! ఒకే మాటను ఉచ్చరించండి ! సమాన మనస్సులతో సంచరించండి!'' అన్న వేదార్థాన్ని గ్రహించి ఆమార్గాన్ని సుసంపన్నం చేసే వారందరికీ స్వాగతం పలుకుతూ, ఈ బృహద్గీతాకారుని కృషిని ప్రశంసిస్తూ -సెలవ్

భాగ్యనగర్
తేది 1997 అక్టోబర్ 31

**-డా॥ కసిరెడ్డి**
కార్యదర్శి
జాతీయ సాహిత్య పరిషత్, ఆం. ప్ర

# అభినందనలు

ఈశ్వర ప్రోక్తమగు వేదవాణి ప్రతియుగమునను నిత్య నూతన శోభాన్వితమై ప్రాజ్ఞుల నోట ప్రతిధ్వనించుచునే ఉన్నది ఇట్టి వేద విజ్ఞానమును సామాన్యులకు కూడ అందుబాటు లోకి తెచ్చి వారిని ధర్మ మార్గమున నడుపుటకై ఋషులు చేసిన ప్రయత్న ఫలమే ఉపనిషత్తుల ఆవిర్భావం

ఉపనిషత్తులకే తల మానికమైన బృహదారణ్యకములోని పరమేశ్వరతత్త్వమును మిత్రులు డా॥ వసన చెన్నప్పగారు సరళ సుందరమైన గేయములలో ఆవిష్కరించుటయేగాక వాటిని 'బృహద్గీత' రూపములో మనకందించుట మన అదృష్టము. జటిలమైన ధార్మిక విషయములను మనస్సుకు హత్తుకొను విధముగా చెప్పుటకు వారీ గ్రంథమున మొదటి నుండి చివరి వరకు ప్రయత్నించినారు ఇందలి గేయములను వారు స్వయముగా చదువునప్పుడు విన్నచో వాటి మాధుర్యము బోధపడగలదు. గేయములలోని పదముల కూర్పు మనను మంత్రముగ్ధులను చేయగలదు. అంతేకాదు, ఒక్కమారు మనము విన్నచో వారి గేయములు మన పెదవుల మీద అలవోకగా నాట్యము చేయగలవు.

పండిత గోపదేవశాస్త్రిగారి శతజయంతి ఉత్సవము 30 7 95 నాడు సికింద్రాబాదు నగరములో వైభవముగా జరిగినది. డా॥ చెన్నప్పగారు ఆ కార్యక్రమమునకు వ్యాఖ్యాతగా వ్యవహరించినారు ఆ తర్వాతనే వారు గోపదేవులకు శిష్యులై ఉపనిషత్తులను, దర్శనములను నేర్చుకొని వాటిలో మంచి పాండిత్యమును సంపాదించినారు. వారు ప్రతిభావంతముగా రచించిన ఈ 'బృహద్గీత'ను ధర్మానురక్తి గల తెలుగు వారందరికి అందించవలసిన బాధ్యత మన మీద ఉన్నది. ఒకే ఛందస్సులో పన్నెండువందల గేయములను రచించి తెలుగు సాహిత్యములో ఒక క్రొత్త ఒరవడిని సృష్టించిన డా॥ చెన్నప్ప గారికి నామన. పూర్వకమైన అభినందనలు తెలియజేయుచున్నాను

**ఏ. విశ్వేంద్ర ఆర్య**
కన్వీనర్,
వేద విజ్ఞాన వేదిక, హైద్రాబాదు

# విషయ సూచిక

❀❀❀

# ప్రథమాధ్యాయం

## 1. విశ్వహయం

సృష్టి అశ్వం శిరముషస్సూ
కన్ను సూర్యుడు ప్రాణమనిలం
అగ్ని వదనం ఆత్మ సమయం
పృష్ఠ భాగం దేవ లోకం 1.1.1

కుక్షి గోళం అంత రిక్షం
కాలి గిట్టలు మనుజ లోకం
ప్రక్కటెముకలు అష్ట దిక్కులు
సూక్ష్మ భాగము లారు ఋతువులు 1.1.2

ఎముకలేమో తారకాతతి
మాంసమేమో మేఘ సంతతి
సగము అరిగిన తిండి ఇసుకా
ప్రేవులేమో జీవ నదులూ 1.1.3

శ్వాస కోశము లేమొ నగములు
రోమ జాలము లౌషధమ్ములు
పూర్వ కాయం ప్రొద్దు పొడుపూ
పశ్చిమార్ధం క్రుంకు భానుడు 1.1.4

ఆవులింతలు సృష్టి వెలుగులు
గమన రీతులు మెరుపు తీగలు
ప్రస్రవణమే వర్షోదకం
సకిలింపులే గర్జా రవం 1.1.5

సృష్టి అశ్వం ముందు వెనుకల
మహిమ జూపే కాలి గజ్జెలు
పూర్వ పశ్చిమ సాగరమ్ముల
పుట్టి నిలిచిన పగలు రేలూ 1.1.6

అనుభవింతురు సృష్టి వాజిని
హింస సేయుదు రుర్వి అర్వను
కడుపు నింపునె జగతి అశ్వం?
విడువలెండిక విశ్వ హయమూ! 1.1.7

## 2. మృత్యురూప బ్రహ్మం – సృష్టి

సృష్టి కంటెను ముందు బ్రహ్మము
మృత్యు రూపము పొంది యుండును
సృష్టి చేసీ లయమొనర్చి
కరకుటాకలి బాయుచుండును. 1.2.1

మృత్యు రూప బ్రహ్మచే పర
మాణువుల్ చలియించు చుండును
క్రమముగా ద్రవ రూపమేర్పడి
అర్కమనియెడి పేరు దాల్చును 1.2.2

అర్కమున కఠినంపు భాగము
గొప్పదై అది పృధ్వి అయ్యెను
క్రింది భాగము నీరమై ఆ
నీటి వలననె అగ్ని పుట్టెను 1.2.3

మృత్యు రూప బ్రహ్మముంచెను
స్వీయ తేజోమయ శరీరము
పృధ్వి యందు ద్యులోకమందును
మరియు ఆకాశమ్మునందును 1.2.4

మృత్యు రూప బ్రహ్మమున కీ
జడ జగత్తే మొదటి దేహము
వాఙ్మనమ్ముల గూడు చేతన
జగమె దాని ద్వితీయ దేహము 1.2.5

చేతనమ్మగు జగము నడవగ
కాలమును సృజియించె బ్రహ్మము
మృత్యు రూపమ్మౌండినందున
ఆకలేసీ నోరు తెరిచెను 1.2.6

కాల చక్రం భీతినొందగ
బాణు బాణను ధ్వనులు పుట్టెను
క్రమముగా ఆ ధ్వనులు వాక్కై
అవతరించెను లోకమందున 1.2.7

వాక్కుచే ఋగ్యజుస్సామా
ధర్వముల్ రచియించి బ్రహ్మము
తాను జేసిన సృష్టినంతయు
మ్రింగ దలచుచు అదితియయ్యెను 1.2 8

బ్రహ్మమాకాంక్షించినంతనె
ప్రాణమావిర్భావమొందెను
క్రమముగా జడచేతనాత్మక
విశ్వ దేహము వృద్ధినొందెను 1.2.9

మృత్యు రూప బ్రహ్మ దేహం
బైన విశ్వమె అశ్వ మేధము
వత్సరమ్మగు దాక తిరుగుచు
తిరిగి వెనుకకు మరలి వచ్చును 1.2.10

సూర్య చంద్రులు పృధివ్యాదులు
ముఖ్యమగు ఆహారమతనికి
ఇతర జడ చేతన జగత్తులు
సూర్య చంద్రుల కోగిరమ్మగు 1.2.11

## 3. ప్రాణ మహిమ

ప్రజా పతికి దేవాసురులను
వారు కొమరులు, పిండమున బ్ర
హ్మాండమున అధికారమును చే
పట్టగా స్పర్థలను బూనిరి 1 3.1

యజ్ఞములు పిండమ్ము, బ్రహ్మాం
డమ్ము; ఉద్గీథమున దేవత
లసురులను కాదనుచు వారిని
మించి ముందర బోవనెంచిరి 1.3.2

కనుకనే 'ఉద్గాత' కమ్మని
వాక్కునడిగిరి వేడ్క తోడను
దేవతలకై వాణి యంతట
పాడుటకు సంసిద్ధమయ్యెను 1.3.3

కాని తన కర్మకు లభించెడి
పుణ్యమును దేవతల కిచ్చియు
తలచె నుత్తమ ఫలము తనకే
దక్కవలెనని మనసు లోపల 1.3.4

వాక్కు స్వార్థము తెలిసి యసురులు
దాని చేత అసత్యమాడగ
జేసి తాము జయమ్ము గాంచిరి
దేవతలువిఫలమ్ము నొందిరి 1.3.5

కనుకనే ఉద్గాత కమ్మని
ఘ్రాణమడిగిరి వేడ్క తోడను
దేవతలకై ఘ్రాణమప్పుడు
పాడుటకు సంసిద్ధమయ్యెను 1.3.6

కాని తన కర్మకు లభించెడి
పుణ్యమును దేవతలకిచ్చియు
తలచె నుత్తమ ఫలము తనకే
దక్కవలెనని మనసు లోపల 1.3.7

ముక్కు స్వార్థము తెలిసి అసురులు
దానిచే చెడు గంధమును గై
కొనగ జేసి జయమ్ము గాంచిరి
దేవతలు విఫలమ్ము నొందిరి 1.3.8

కనుకనే ఉద్గాత కమ్మని
నేత్రమడిగిరి వేడ్క తోడను
దేవతలకై నేత్రమప్పుడు
పాడుటకు సంసిద్ధమయ్యెను 1.3.9

కాని తన కర్మకు లభించెడి
పుణ్యమును దేవతలకిచ్చియు
తలచెనుత్తమ ఫలము తనకే
దక్కవలెనని మనసు లోపల 1.3.10

కన్ను స్వార్థము తెలిసి అసురులు
దానిచే చెడు చూడగలిగెడి
నటుల జేసి జయమ్ము గాంచిరి
దేవతలు విఫలమ్ము నొందిరి 1.3.11

కనుకనే ఉద్గాత కమ్మని
శ్రోత్రమడిగిరి వేడ్క తోడను
దేవతలకై శ్రోత్రమప్పుడు
పాడుటకు సంసిద్ధమయ్యెను 1.3.12

కాని తన కర్మకు లభించెడి
పుణ్యమును దేవతలకిచ్చియు
తలచె నుత్తమ ఫలము తనకే
దక్కవలెనని మనసు లోపల 1.3.13

దాని స్వార్థము తెలిసి అసురులు
దానిచే చెడు వినగ గలిగెడి
నటుల జేసి జయమ్ము గాంచిరి
దేవతలు విఫలమ్ము నొందిరి 1.3.14

కనుకనే ఉద్గాత కమ్మని
మనసు నడిగిరి వేడ్క తోడను
దేవతలకై మనసు కూడా
పాడుటకు సంసిద్ధమయ్యెను 1.3.15

కాని తన కర్మకు లభించెడి
పుణ్యమును దేవతల కిచ్చియు
తలచె నుత్తమ ఫలము తనకే
దక్క వలెనని మనసు లోపల 1.3.16

మనసు స్వార్థము తెలిసి అసురులు
దానిచే చెడు దలచు నట్టుల
జేసి తాము జయమ్ము నొందిరి
దేవతలు విఫలమ్ము నొందిరి 1.3.17

కనుకనే ఉద్గాత కమ్మని
దేవతలు ప్రాణమ్మునడిగిరి
ప్రాణమంతట వేడ్క తోడను
పాడుటకు సంసిద్ధమయ్యెను 1.3.18

కాని తన కర్మకు లభించెడి
పుణ్యమును దేవతల కిచ్చియు
తలపదుత్తమ ఫలము తనకే
దక్క వలెనని మనసు లోపల 1.3.19

దేవతలు తమ కంటె ముందర
పోవుటొప్పని అసురులప్పుడు
ప్రాణమును పాపమ్ముతో సం
యుక్త పరచగ నిశ్చయించిరి 1.3.20

కాని ప్రాణము దాకి నిలవగ
లేక అసురులు మూర్ఛపోయిరి
మట్టి పెల్లలు కొండ ఢీ కొని
నిలువ జాలక విరిగి నట్టుల 1.3.21

అపుడు దేవతలగ్రసరులై
పిండమున బ్రహ్మాండమున ఆ
ధిక్యమును సాధించి ప్రాణము
నెంతయును కొనియాడుచుండిరి 1.3.22

మరియు దేవతలెల్ల - తమకై
శుభము గూర్చిన ప్రాణదేవత
ఆస్యమందున నిలిచి వెలుగుట
చే అయాస్యం డనుచు పిలిచిరి 1.3.23

ప్రాణమును విద్వాంసు లెప్పుడు
దూరమని పిలువంగ జూతురు
మృత్యు దేవత ప్రాణమును గని
దూర దూరములందు నిలుచును 1.3.24

ఈ రహస్యము తెలియు వానిని
మృత్యు దేవత బాధ పెట్టదు
మరియు నాతని కెల్ల వేళల
దూరమందే నిలిచి యుండును 1.3.25

అకట! ఈ బ్రహ్మాండ గతమగు
అగ్ని పిండము నందు చిక్కుచు
వాణిగా వ్యవహార మొందును
మృత్యువును గుర్తింప జాలక 1.3.26

కాని ఈ ప్రాణమ్ము వాణికి
మృత్యు బంధము తొలగ ద్రోసిన
అగ్ని రూపము తోడ అయ్యది
తేజ రిల్లును లోక మంతట 1.3.27

అకట! ఈ బ్రహ్మాండ గతమగు
గాలి పిండము నందు చిక్కుచు
ఘ్రాణముగ వ్యవహారమొందును
మృత్యువును గుర్తింప జాలక 1.3.28

కాని ఈ ప్రాణమ్ము ఘ్రాణము
మృత్యు బంధము తొలగ ద్రోసిన
వాయు రూపము తోడ అయ్యది
వ్యాప్తి చెందును విశ్వమంతట 1.3.29

అకటా! ఈ బ్రహ్మాండ గతమగు
ఇనుడు పిండము నందు చిక్కుచు
నేత్రముగ వ్యవహార మొందును
మృత్యువును గుర్తింప జాలక 1.3.30

కాని ఈ ప్రాణమ్ము నేత్రము
మృత్యు బంధము తొలగ ద్రోసిన
భాస్కరాకృతి తోడ అయ్యది
అంత రిక్షము నందు వెలుగును 1.3.31

అకటా! ఈ బ్రహ్మాండ గతమగు
దిశలు పిండము నందు చిక్కుచు
శ్రోత్రముగ వ్యవహార మొందును
మృత్యువును గుర్తింప జాలక 1.3.32

కాని ఈ ప్రాణమ్ము శ్రోత్రము
మృత్యు బంధము తొలగ ద్రోసిన
దిశల రూపము తోడ అయ్యది
జగతిలో అలరారుచుండును 1.3.33

అకటా! ఈ బ్రహ్మాండ గతమగు
విధుడు పిండము నందు చిక్కుచు
మనసుగా వ్యవహారమొందును
మృత్యువును గుర్తింప జాలక 1.3.34

కాని ఈ ప్రాణమ్ము మనసును
మృత్యు బంధము నుంచి బ్రోచిన
విధుని రూపము తోడ అయ్యది
భువనమున వెలుగొందుచుండును 1.3.35

ఈ రహస్యము తెలియునాతడు
ప్రాణదేవత దయకు పాత్రుడు
మృత్యుబారిన పడక యెప్పుడు
ముక్తుడై వెలుగొందు ధీరుడు 1.3.36

ప్రాణదేవత ఇంద్రియములకు
మృత్యు బంధము తొలగ ద్రోయుచు
భోజ్యమగు అన్నమును గూర్చియు
మధురమౌ గానమ్ము జేయును 1.3.37

అన్న మంతా ప్రాణమే దిను
ప్రాణమందే అన్నముండును
ప్రాణ దేవత తన బలమ్మును
పరుల కొసగుట గాన మనబడు 1.3.38

అన్నమును సృజియించు ప్రాణము
అన్నమును భుజియించు ప్రాణము
అన్నమును ధరియించు ప్రాణము
అన్నమును హరియించు ప్రాణము 1.3.39

ప్రాణమొసగిన బలము వలననె
వాక్కు అగ్నిగ, ముక్కు గాలిగ,
కన్ను రవిగా, చెవి దిశలుగా
మనసు విధునిగ మారి పోవును 1.3.40

లోకమంతయు అన్నమే, మా
కందులో భాగమ్ము నిమ్మని
ఇంద్రియమ్ములు గోర వానిని
తనలో నిలువగ గోరె ప్రాణము 1.3.41

ఇంద్రియమ్ములు నాల్గు వైపుల
నుండి ప్రాణము లోనికేగియు
ప్రాణమన్నమ్మును భుజించిన
తాము తృప్తిని పొందు చుండెను 1.3.42

పరులకివ్వక ఎవడు తినునో
వానికెన్నడు తృప్తి తీరదు
తాను తింటూ పరులకొసగీ
బ్రతుక నేర్చిన వాడె ధన్యుడు 1.3.43

ప్రాణమెట్టుల ఇంద్రియమ్ముల
చేర దీయుచు భోగమొసగునో
మనుజుడట్టుల తోటి వారిని
ప్రేమతో పోషింప వలయును 1.3.44

స్వార్థమును విడ నాడి పరులకు
శుభము గూర్చెడి వాని కెవ్వడు
కీడు సేయునో వాడు ప్రాణము
చేత అసురుల వలె నశించును 1.3.45

యోగ్యులై చరియించు వారిని
చేర దీయుచు బ్రోచు మనుజుడు
ఇంద్రియములకు ప్రాణమట్టుల
పోషకుండై కీర్తి గాంచును 1.3.46

ప్రాణమనియెడి భర్తకెప్పుడు
భార్యలగునీ యింద్రియమ్ములు
భరణ యోగ్యుల నేలు వారిని
భర్తలుగ విద్వాంసు లెంతురు 1.3.47

ప్రాణమే మన అంగి రసమగు
ప్రాణమే సుఖ దాయకమ్మగు
ప్రాణమే మన తనువు వీడిన
ప్రాప్తమగునది మృత్యువే కద! 1.3.48

అధికురాలగు వాణి 'బృహతీ'
వాణికిని భర్తగుట చేతను
ప్రాణదేవత యగు 'బృహస్పతి'
ప్రాణమే కద బ్రోచె వాణిని! 1.3.49

ప్రాణమనగా సామమే కద!
లోకమంతట ఉన్నదే కద!
సామరూపంబెరుగ గలిగిన
స్వార్థమెక్కడి దండి మనిషికి? 1.3.50

ప్రాణమే ఉద్గీథమన బడు
వాణి 'గీథా' ప్రాణమే 'ఉత్'
ప్రాణ శక్తికి నిలిచి సర్వము
పరమ పురుషుని కొలుచు చుండును 1.3.51

ప్రాణ మెప్పుడు వాణితో జత
గూడి ఈశుని పాడు చుండును
ప్రాణమెన్నడు వాణి గాదని
పాడ దుద్గీథమ్ము స్వయముగ 1.3.52

స్వర ప్రధానము సామ వేదము
స్వరమె దానికి ముఖ్య సంపద
స్వరమెరింగిన ఋత్విజుండగు
స్వరమెరుంగుము స్వరమెరుంగుము 1.3.53

స్వరమె సామానికి సువర్ణము,
శుద్ధ వర్ణోచ్చారణమ్మున
గాన రూప స్వర్ణమునకును
కొరత యనునది ఉండనేరదు 1.3.54

వాణి యందు ప్రతిష్ఠితంబై
ప్రాణ మీశుని పాడుచుండును
వాణినే సామకు ప్రతిష్ఠగ
దలతురేని ప్రతిష్ఠగలుగును 1.3.55

సత్ స్వరూపామృతము కొరకై
సామగానము సేయవలయును
ప్రథమమున [1]పవమాన మంత్ర
త్రయమునే జపియింప వలయును 1.3.56

సత్తు నొందు మసత్తు విడిచియు
జ్యోతి గనుము తమస్సు దొరగియు
అమృతమానుము మృతిని గడచియు
అప్పుడే విజయమ్ము నీకగు 1.3.57

---

1 ''అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా ఽమృతం గమయ''

ఉద్గాత పవమాన స్తోత్రాలైన ఈ మూడు మంత్రాలతో మొదట అమరత్వాన్ని కోరి, ఆ తదుపరి ఇతర స్తోత్రాలతో భౌతిక పదార్థాలను కోరుతాడు ఈ మూడు మంత్రాలు 'మృత్యువు వద్దు అమృతాన్ని పొందుము' అనే అర్థాన్ని ఇస్తున్నాయి

| | |
|---|---|
| అసత్ = మృత్యువు | సత్ = అమృతము |
| తమస్సు = మృత్యువు | జ్యోతిః= అమృతము |
| మృత్యుః = మృత్యువు | అమృతం = అమృతము |

## 4. సృష్టి రచన

సృష్టిరచనకు ముందు బ్రహ్మ
మ్మొక్కడే వెలుగొందు చుండెను
కనుకనే 'అహమస్మి' అని త
న్నెంతయును ప్రకటించుకొనియెను 1.4.1

బ్రహ్మమొక్కడు వెలుగుచుండియు
సంత సింపగ లేక పోయెను
కనుకనే తన తోటి జీవుల
కోసమై ఈ సృష్టి జేసెను 1.4.2

స్త్రీ పురుష తత్త్వములు కలుపుచు
మనుజ జాతిని జేసె బ్రహ్మము
యాజ్ఞవల్క్యుడు పలికినట్టుల
అర్ధభాగలము మన శరీరము 1.4.3

ఈశ్వరుని సంకల్ప బలమున
పతియు పత్నియు గాగ జీవులు
దేహ ధారణ జేసి నంతనె
సృష్టిలో చలనమ్ము కలిగెను 1.4.4

ఎదుట పురుషుని చూసి సిగ్గిలి
ఆవుగా స్త్రీ మారి పోయెను
పురుషుడెద్దై దాని గవయగ
రెంటిచే గో జాతి పుట్టెను 1.4.5

క్రమముగా స్త్రీ పురుషులిరువురు
కామ రూపము లెత్తుచును గు
ఱ్ఱమ్ము, గాడిద, మేక, గొఱ్ఱియ
మొదలు కొని చీమలను గాంచిరి 1.4.6

ఈశ్వరుని సంకల్ప బలమున
సర్వ ప్రాణుల లోన జంటలు
ప్రభవమొంది, అనేక జాతుల
తోడ లోకము వెలిగిపోయెను 1.4.7

ఒక్క ఆత్మకె సృష్టి అంతయు
హస్త గతమై యుండునెప్పుడు
అగ్ని, వాయువు, ఇంద్రుడాదిగ
దేవతల పూజించి వ్యర్థము 1.4.8

రకరకమ్ముల భోగ్య వస్తువు
లీశ్వరుండే సృష్టి జేసెను
మనిషి వాటిని అగ్ని ముఖుడై
ఆరగించుచు బ్రతుకనేర్చెను 1.4.9

సృష్టి, తొలి దశలోన స్పష్టము
గాకయుండిన చూచి బ్రహ్మము
వాక్సహాయము చేత దానికి
నామ రూపము లేరు పరిచెను 1.4.10

రూపమిదియని, నామమిదియని
రూఢి పరిచిన కారణమ్మున
లోకమున సులభమ్ముగా వ్యవ
హారములు సాధ్యమ్ములయ్యెను 1.4.11

కత్తి మంగలి పొదిని నున్నటు
లగ్ని కొయ్యలొ దాగి యున్నటు
లాత్మ సర్వము నందు వ్యాపక
తత్త్వ మై భాసిల్లు చున్నది 1.4.12

ఆత్మ తత్త్వము నెవరు గాంతురు ?
పూర్ణముగ అది ఎచట దొరుకును?
శ్వాస జరిపిన ప్రాణ మందురు
మాటలాడిన వాణి యందురు 1.4.13

చూచునప్పుడు నేత్రమందురు
విన్న యప్పుడు శ్రోత్రమందురు
తలచి నప్పుడు బుద్ధి యందురు
కాని సత్యము తెలియ జాలరు 1.4.14

ప్రాణమనుచూ వాణి యనుచూ
నేత్రమనుచూ శ్రోత్రమనుచూ
బుద్ధి యనుచూ ఆత్మనెప్పుడు
పూజ సేయుట వ్యర్థమే యగు 1.4.15

వాణి మొదలగు ఇంద్రియమ్ముల
నాత్మలని భ్రమియింప కూడదు
ఆత్మనెప్పుడు ఆత్మ రూపము
నందె గొలుచుట మంచి పద్ధతి 1.4.16

ఆత్మ లోనే ఇంద్రియమ్ములు
ఒక్కటై నివసింప గలుగును
అట అహంకారమ్ము చూపక
బయట మాత్రము శిరములెత్తును 1.4.17

కనుక మనుజుండెల్ల వేళల
ఏది అన్నిటి కాత్మ యగునో
దాని నన్వేషింప వలయును
అదియు తెలిసిన అన్ని తెలియును 1.4.18

విడిచి పోయిన జంతువును పద
చిహ్నముల తో తెలియునట్టుల
విస్మరించిన ఆత్మ తత్త్వము
బుద్ధి తో గుర్తింప వలయును 1.4.19

ఆత్మనే కొలువంగ వలయును
ఆత్మ తత్త్వమె ప్రియము పుత్రుని
కంటె, కోట్ల ధనమ్ము కంటెను,
సర్వ వస్తు చయమ్ము కంటెను 1.4.20

ఆత్మ తత్త్వము కంటె అన్యము
ప్రియముగా దలపంగ నేటికి?
ఎంత సంపద కలిగి యున్నను
ఆత్మ తత్త్వము బోధ పడునే? 1.4.21

ఆత్మ కంటెను అన్య వస్తువు
గొప్పదని భావింతు రేనియు
ఆత్మ తత్త్వము తెలిసి కొనుటకు
అయ్యదియె ప్రతి బంధకమ్మగు 1.4.22

నీకు అన్యమె గొప్పదగుచో
ఆత్మ తత్త్వమ్మెట్లు తెలియును
ఆత్మ అన్నిటి కంటె ప్రియమని
ఆత్మ లో నెరుగంగ వలయును 1.4.23

సృష్టి కంటెను ముందు బ్రహ్మము
'నేను బ్రహ్మము' ననుచు తెలిసెను
బ్రహ్మమని తా తెలిసి కొని బ్ర
హ్మాండ మంతట వెలుగుచుండెను 1.4.24

దేవతలలో ఋషులలో మా
నవులలో నే బ్రహ్మనని యె
వ్వండు తెలియునో వాడు బ్రహ్మగు,
బ్రహ్మ అనగా గొప్ప వాడని- 1.4.25

ఆత్మ తత్త్వము తెలిసి యుండిన
వాడు కనుకనె వామ దేవ మ
హర్షి పూర్వము 'నేను మనువును
నేను సూర్యుడ' ననుచు నుడివెను 1.4.26

ఎవడు తనదగు శక్తి నెరిగియు
విధులు నిర్వర్తించు చుండునో
అతని ఐశ్వర్యమ్ము దేవత
లడ్డగింపరు నిశ్చయమ్ముగ 1.4.27

ఆత్మ విద్య నెఱుంగు మనుజుడు
అన్య దేవత కొలువు సేయడు
పృథ్వి మొదలగు దేవతాతతి
కాత్మయై వెలుగొందు నాతడు 1.4.28

గొప్ప వాడను నేను కానను
న్యూన భావము గలిగి యెవ్వడు
బ్రతుకు నీడ్చునో, అతడు ముప్పది
మూడు దేవతలందు మూర్ఖుడు 1.4.29

మానవుల అడుపాజ్ఞలందున
జంతు సంతతి మెలుగు నట్లుగ
క్షుద్రభావన చేత మనుజులు
దేవతలకును లొంగియుందురు 1.4.30

పశువులందొక పశువు దప్పిన
పసుల కాపరి బాధపడు గతి
మనుజుడొక్కడు జారి పోయిన
దేవతలు చింతిల్లుచుందురు! 1 4.31

ఆత్మ తత్త్వము నెరుగ జాలక
చావు పుట్టుకలందు మునుగుచు
తమకు సేవలు సేయ వలెనని
దేవతలు భావించుచుందురు! 1.4.32

చిత్రమగు ఈ సృష్టి లోపల
బ్రహ్మ తత్త్వము నెరిగి మనుజులు
గొప్ప వారమటంచు పలికిన
దేవతలకది ఇష్టముండదు 1.4.33

అన్ని తెలిసిన పర బ్రహ్మము
లోక హితమును కోరు వాడై
సర్వశక్తికి మూలభూతం
బైన బ్రాహ్మము సృష్టి జేసెను 1.4.34

అంత బ్రహ్మమ్మూర కుండక
లోక హితమును కోరువాడై
క్షాత్ర ధర్మము వైశ్య ధర్మము
శూద్ర ధర్మము సృష్టి జేసెను 1.4.35

బుద్ధి బలమూ భుజ బలమ్మూ
ధన బలమ్మూ శ్రమ బలమ్మూ
క్రమముగా ఈ నాల్గు బలములు
కా వలెను లోకమ్ము నడవగ 1.4.36

బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు
శూద్రులనబడు పేర్లు మనుజుల
కర్మ ప్రాధాన్యమును బట్టి జ
గమ్ము లోపల పెట్టి నట్టివి 1.4.37

పుట్టగానే మనుజుడెవ్వడు
బ్రాహ్మణుండై ఉండనేరడు
స్వీయకర్మల బట్టి యాతని
పేరు నిశ్చయ మగుచునుండును 1.4.38

లోకమున ధర్మమును మించిన
దొండుగానము, ధర్మముననే
నిర్బలుండును వీర్య వంతుని
నిజము గా శాసింప గల్గును 1.4.39

సత్యమే ధర్మమ్ము, ధర్మమె
సత్యమని భావింప వలయును
సత్యమును వచియించు వానిని
ధర్మ పరుడని యెంచవలయును 1.4.40

బ్రహ్మమెరిగిన వాడె బ్రాహ్మణుం,
డార్త రక్షకుడగును క్షత్రియు,
డన్ని దిశలకు వెడలు వైశ్యుడు,
విమల సేవాపరుడు శూద్రుడు 1.4.41

బ్రహ్మ తత్త్వము వలన మానవ
ధర్మములు ప్రభవించుచుండును
వాని నెరుగక పోవువానికి
మోక్షమెట్లు లభింప గల్గును? 1.4.42

ఎట్టి ధర్మము ననుస రించిన
అట్టి పేరే కలుగు చుండును
బ్రాహ్మమును వరియింప గల్గిన
బ్రాహ్మణుండై వెలుగుచుండును 1.4.43

ప్రాణి కోటిలొ జ్ఞానులందున,
జడ జగత్తున అగ్ని యందున
బ్రహ్మ తత్త్వము స్వీయ శక్తిని
విస్త రింపగ జేయు చుండును 1.4.44

తన స్వరూపము తెలిసి కొనకనె
మృత్యు ముఖమును చేరు మనుజుడు
బ్రహ్మమును గుర్తింప జాలడు
స్వీయ వృద్ధి నెరుంగ జాలడు 1.4.45

వేదమును పరియింప జాలని
వానికది ఫలమీయనట్లుగ
స్వ స్వరూపము నెరుగజాలని
వాని జన్మము నిష్ఫలమ్మగు 1.4.46

ఆత్మ తత్త్వము నెరుగజాలని
వాని ఉత్తమ కర్మలన్నియు
అనుభవింపగ జేసి ఫలములు
అంతమున క్షీణించు చుండును 1.4.47

కనుక ఉత్తము డెల్ల వేళల
ఆత్మ లోకము నుపాసించును
క్షుద్రుడను నేనెంత మాత్రము
కానటంచును తెలియనేర్చును 1.4.48

ఆత్మ లోకము నుపాసిస్తూ
తన మహత్త్వము నెరుగగల్గిన
మానవుండే లోకమున తా
తలచినది సాధింపగల్గును 1.4.49

భూత సంతతి కాత్మ లోకము
యజ్ఞమాత్మకు దేవ లోకము
అర్థమెరుగుచు పఠన పాఠన
ములు ఘటించుట ఋషుల లోకము 1.4.50

ధర్మమును విడనాడ కుండుట
తల్లి దండ్రుల సేవ జేయుట
మంచి సంతానమును పొందుట
మనిషికెప్పుడును పితృలోకము 1.4.51

మానవాళికి గ్రాస వాసము
లందజేయుట మనుజ లోకము
జంతువులకు తృణోదకమ్ములు
గూర్చ గల్గుట జంతు లోకము 1.4.52

ఆత్మ కీ లోకమ్ములెల్లా
సంచరింపగ దగిన స్థలములు
కనుక ఈ లోకములతో ఏ
కాత్మతను సాధింపవలయును 1.4.53

దేవ, ఋషి ఋణములను దీర్చెడి
పుణ్య పురుషునికెల్ల ప్రాణులు
శుభము లాకాంక్షించుచుండును
కీర్తిమంతుండగుచు నిలువగ 1.4.54

లోకమున కోరికలు రెండే
రెండు ముఖ్యము లనగ వచ్చును
ఒకటి సంతానమును పొందుట
రెండు విత్తము కూడ బెట్టుట 1.4.55

తగిన సంతానమును పొందగ
భార్య గావలెనండి తప్పక
సముచితమ్మగు కర్మ సేయగ
ధనము గావలెనండి ఒప్పుగ 1.4.56

విత్త సంతానముల లోపల
ఒకటి లభ్యము కాక యున్నను
తాను పూర్ణత పొందినట్లుగ
మానవుడు భావింప నేరడు 1.4.57

స్త్రీ ధనమ్ము లభించి నంతనె
పూర్ణతెట్టుల గలుగు మనిషికి?
మనసు నాత్మగ కనులనాస్తిగ
వాక్కు భార్యగ దలప వలయును 1.4.58

ప్రాణమును సంతానముగ, సత్
కర్మనే దేహమ్ముగా భా
వించి జీవన యాత్ర చేసెడి
వానినే విద్వాంసుడందురు 1.4.59

మనసు, ప్రాణము, చెవులు, కన్నులు
కర్మ ఐదును కలిసి యజ్ఞము
పశువు శిశువూ యజ్ఞ రూపమె
సృష్టి యంతయు యజ్ఞ రూపమె 1.4.60

## 5. సప్తాన్నాలలో ప్రాణోత్కృష్టత

లోకములు సృష్టించి పోషణ
భారమూడల దాల్చి బ్రహ్మము
బుద్ధి పూర్వకమైన తపమున
సప్త సరసాన్నములు కూర్చెను 1.5.1

వాని లో సాధారణమ్మగు
అన్నమొక్కటి, రెండు దేవత
లందు పంచెను, మూడు తనకై
నిలిపి పశువులకొకటి యిచ్చెను 1.5.2

పసులకిచ్చిన అన్న మందే
లోక మంతా నిలిచి ఉన్నది
ఎంత దిన్నను నామ మాత్రమె
కాని తరుగదు కొంచెమైనను 1.5.3

అక్షయమ్మగు అన్న భండా
రమ్ములో మన తిండి ఎంతగు?
అందరము భుజియించు అన్నమె
జగము లో సాధారణాన్నము 1.5.4

అన్నమందరిదన్న మాటను
మరిచి పరులకు పెట్ట నేరక
అనుభవించెడి స్వార్థ పురుషుని
పాప భోగిగ తలప వలయును 1.5.5

హుతము, ప్రహుతము రెండు కూడా
దేవతలకే చెంది నట్టివి
ఒకటి అగ్నిలో వేయునట్టిది
ఒకటి దానము చేయునట్టిది 1.5.6

శుభకరమ్మగు పనులు సేయుచు
తాను దినుటకు ముందు మనుజుడు
దైవ భావన తోడ అగ్నికి
చేయు ఆహుతి 'హుత'మనంబడు 1.5.7

లేదు పామ్మని కసిరి కొట్టక
ఆకలిని గుర్తించి మనుజుడు
దైవ భావన తోడ యితరుల
కొసగు అన్నమె 'ప్రహుత' మనబడు 1.5.8

కొందరి కమావాస్య, పూర్ణిమ
దేవతాన్నము లగును, వారును
స్వార్థమును విడనాడి హుతమును
ప్రహుతమును జరుపంగ వచ్చును 1.5.9

పాలు పశువులకున్న అన్నము
పశువు లైనను మనుషు లైనను
మొదట పాలను గ్రోలి మాత్రమె
ప్రాణముృలు ధరియించు చుందురు 1.5.10

జననమొందిన శిశువులకు ప్ర
ప్రథమమున నాకింత్రు ఘృతమును
స్తన్య పానమె సేయు పుట్టిన
శిశువులైనను పశువులైనను 1.5.11

పుట్టగానే దూడలెప్పుడు
గడ్డినించుక ముట్టజాలవు
పాలు గ్రోలగ నిచ్చగిస్తూ
పొదుగు పట్టుక వ్రేలుచుండును 1.5.12

పశువులన్నము మీద అన్నిటి
స్థితియు నుండుట లోకధర్మము
పాల లోనే ప్రాణి కోటికి
బ్రతుకు గలదని తలప వలయును 1.5.13

ఒక్క వత్సర మెవడు తప్పక
పాలు ద్రాగుచు గడప గలడో
అతడు మృత్యువునాదరమ్మున
గెలుచునని విద్వాంసులందురు 1.5.14

బుద్ధి పూర్వకమైన శ్రమతో
మాటి మాటికి పురుషుడన్నము
వృద్ధి సేయుచు నుండ వలయును
అప్పుడే అది తరుగకుండును 1.5.15

పరమ పురుషుని సృష్టిలో గల
అన్న భండారమ్ము గొప్పది
చిన్న నోటితొ తిన్నదంతా
నామమాత్రము కాక యేమగు? 1.5.16

మనసు వాక్కూ ప్రాణమనియెడి
అన్నములు మూడాత్మగతములు
మనసు విడిగా నుండుననియెడి
మాట నమ్మగ రానిదెప్పుడు 1.5.17

మనసు వేరొక చోట ఉండుట
చేత చూడము, వినమటంచును
పలుకుచుందురు కాని మనసే
చూచుచుండును వినుచునుండును 1.5.18

కామ సంకల్పాదులన్నియు
మనసు రూపములై చెలంగును
ఎవ్వరైనను వెన్ను దట్టిన
మనసుతోనే గుర్తు పడుదుము 1.5.19

మనసు మనకై ఇచ్చు అనుభవ
మన్నమే కద! మనసు లోని అ
మూర్తమును శబ్దమ్ము తోడ ర
చించు వాణియు నన్నమే కద! 1.5.20

ప్రాణమనగ, అపానమనగా
వ్యానమనగ, ఉదానమనగా
సమానమనగ– ఐదు రూపము
లందు ప్రాణమ్మలరుచుండును 1.5.21

మన శరీరము వాఙ్మయమ్మగు
మనోమయమగు ప్రాణమయమగు
వాఙ్మనః ప్రాణముల మాహా
త్మ్యమ్ము నెవ్వడు చెప్పగల్గును ! 1.5.22

పిండమున అత్యధిక ప్రాము
ఖ్యమును గల్గిన వాఙ్మనః ప్రా
ణములు మూడును మూడు లోకము
లై విరాజిల్లంగ జూతుము 1.5.23

చిత్రమగు బ్రహ్మాండమందలి
భూతలమ్మే వాణిలోకము
అంతరిక్షమె మనోలోకము
ఆ ద్యులోకమె ప్రాణలోకము 1.5.24

వాక్కు సర్వార్థములు తెలుపును
పృథ్వి సర్వార్థమ్ములొసగును
మనసు వాణికి మూలమైనటు
లంతరిక్షమ్మగును పృథ్వికి 1.5.25

ప్రాణమే ఈ వాఙ్మనమ్ముల
నెప్పుడును జీవింపజేయును
ఈద్యులోకమె అంతరిక్ష ధ
రిత్రులను వెలిగింప జేయును 1.5.26

వాఙ్మనః ప్రాణములు మూడును
ఋగ్యజుస్సామమ్ములనబడు
జ్ఞాన కర్మోపాసనలకవి
ప్రాతినిధ్యం కలిగియుండును 1.5.27

వాక్కుదేవత, మనసు పితరులు,
ప్రాణమే మానవులనంబడు.
వాక్కు తల్లిగ, మనసు తండ్రిగ,
ప్రాణమే ప్రజగాగ వర్ధిలు 1.5.28

తెలియబడినది – తెలియబడునది
తెలియబడనిది యనగ జ్ఞానము
ముత్తెరంగుల లోకమందున
ఉండునని తెలియంగ వలయును. 1.5.29

తెలియబడినది వాణి రూపమె
వాణి రూపము నందు జ్ఞానము
ప్రకటితంబై లోకమందున
మానవుని రక్షించుచుండును 1.5.30

తెలియబడునది మనసు రూపము
తెలియదగు విషయములతో మన
సీ జగమ్మును జ్ఞేయకోటిలొ
నిలిపి మనుజుని బ్రోచుచుండును 1.5.31

తెలియబడనిది ప్రాణరూపమె
అది ఎలాంటిదో ఎట్టులుండునొ
తెలియకున్నను లోకమందున
మానవుని కాపాడుచుండును 1.5.32

పిండమగు దేహమ్ము వాణికి,
తనువు బ్రహ్మాండమ్ము పృధివికి,
పిండమున ఉష్ణమ్ము వలె బ్ర
హ్మాండమందున అగ్ని ఉండును 1.5.33

వాణి పిండము గూర్చి తెలుపును
పృధివి బ్రహ్మాండమును తెలుపును
వాణి యెంత విశాలమైనదొ
పృధివి లోపలి అగ్ని అంతే 1.5.34

దేహమగు పిండమ్ము మనసుకు,
తనువు బ్రహ్మాండమ్ము దివికిని,
దేహమందలి అగ్నివలె బ్ర
హ్మాండమున ఆదిత్యుడుండును 1.5.35

మనసు పిండము గూర్చి తెలుపును
దివియు బ్రహ్మాండమును తెలుపును
మనస్సెంత విశాలమైనదొ
దివిని గల ఆదిత్యుడంతే 1.5.36

వాఙ్మనమ్ముల మేళనమ్మున
ప్రాణమెట్టుల ప్రకటమగునో
అగ్నితోడ ద్యులోక సూర్యుని
మేళనమ్మున గాలిబుట్టును 1.5.37

పిండమందలి ప్రాణమును బ్ర
హ్మాండమందున వాయువందురు
ఇదసపత్నము – ఈ రహస్యము
తెలిసెనేని సపత్నులుండరు 1.5.38

పిండమున ప్రాణమ్ము వలె బ్ర
హ్మాండమున జలమొప్పుచుండును
దేహమందలి కాంతి వలె బ్ర
హ్మాండమందున చంద్రుడుండును 1.5.39

పిండమును ప్రాణమ్ము తెలుపును
జలము బ్రహ్మాండమును తెలుపును
ప్రాణమునకును వలె జగమ్మున
జలము కూడ విశిష్టమైనది 1.5.40

వాఙ్మనః ప్రాణమ్ము లీ బ్ర
హ్మాండ మందలి అగ్నితో, భా
స్కరునితో, చందురునితో సరి
సమములని భావింప వలయును 1.5.41

అవియనంతము, లవిమహాంతము;
లవియనంతములని భజించిన
వాడనంతము లైన లోకము
లాదరమ్ముగ గెలువ గలుగును 1.5.42

వాఙ్మనః ప్రాణములు మూడును
అంతవంతములగును తనువున
కాని ఈ బ్రహ్మాండమందు అ
నంతములుగా గోచరించును 1.5.43

ఈ అనంతములకు ననంతము
తోటి గల సంబంధ మరసిన
సాంతమును విడనాడి మనుజు డ
నంతమును దర్శింపగలుగును 1.5 44

కాలమును చందురునితో నుప
మింప వచ్చు, పదేనురాత్రులు
కనుగొనంగ పదేను కళలగు
చివరి కళయే ధ్రువయనంబడు 1.5.45

రాత్రి చేతనె పూర్ణుడాతడు
రాత్రి చేతనె క్షీణుండాతడు
ఈ ధ్రువాంశము తోడ చంద్రుడు
ధ్రువముగా తానుండ గలుగును 1.5.46

పూర్తిగా నమవాస రోజున
ఒక్క కళయును లేని చంద్రుడు
ప్రాణి లోకము నందు సంచా
రమ్ము సేయుచునుండ గల్గును 1.5.47

కాని మరునాడతడు మిగిలిన
ఒక్క కళతో ఉదయమొందును
దినదినాభ్యుదయమ్ము నొందుచు
ప్రాణి కోటికి శుభము గూర్చును 1.5.48

చంద్రుడే ఈ దేహమందున
ప్రాణ రూపుండై వెలుంగును
అతని సత్కారమ్ము కొరకై
ప్రాణ హరణము సేయకూడదు 1.5.49

కాల రూపము తోడ షోడశ
కళలు గల వాడే ప్రజాపతి
పిండమందున ఈ రహస్యము
నెరుగు వానిని పురుషుడందురు 1 5.50

పురుష రూపములోని చంద్రుని
విత్తమే పదిహేను కళలై
వెలుగుచుండగ, ఆత్మ షోడశ
కళగ ప్రాముఖ్యము వహించును 1.5.51

రాత్రులందలి చంద్రుడేగతి
విత్త పూర్ణుడొ విత్త రహితుడొ
లోక మందలి మానవుండును
విత్త పూర్ణుడు విత్త రహితుడు 1.5.52

ఆత్మ అనగా నాభి వంటిది
విత్తమనగా అడ్డనాకులు
విత్తమొకచో రిత్త మైనను
ఆత్మ యెప్పుడు శాశ్వతమ్మే 1.5.53

చక్రమున గల ఆకులన్నియు
విరిగి పోయిన విరుగ వచ్చును
చక్రమందలి నాభి మాత్రము
విరిగిపోయిన జాడగానము 1.5.54

ముఖ్య మైనవి మూడు లోకము
లందు మానవ లోక మొక్కటి
ఒకటి పితృ లోకమ్ము కాగా
ఒకటి మాత్రము దేవ లోకము 1.5.55

తిండి కోసమె బ్రతికి బిడ్డల
కనెడి వారిది మనుజ లోకము
విడిచి స్వార్థము లోకహితమై
మెలగు వారిది పితృలోకము 1.5.56

లోకులకు జ్ఞానమ్ము నొసగుచు
నడుచు వారిది దేవ లోకము
మూడు లోకములందు శ్రేష్ఠము
దేవ లోకముగా నెరుంగుము 1.5.57

సజ్జ నుండగు పుత్రు నొక్కని
గాంచి గెలువుము మనుజలోకము
ధర్మ బద్ధము లైన కర్మలు
చేసి గెలువుము పితృ లోకము 1.5.58

లోకమునకు హితమ్ము గూర్చెడి
విద్యలను దానమ్ము సేయుచు
గెలువ వలయును దేవ లోకము
దేవ లోకమె పుణ్య లోకము 1 5.59

ఉన్నదంతయు సుతుని కొసగిన
అదియె మానుష లోక విజయము
సంన్యసించిన తండ్రి పుత్రుని
పైన భారము మోపి యిట్లను– 1.5.60

''నీవు బ్రహ్మవు, నీవు యజ్ఞము
నీవు లోకము'' కొడుకు దానికి
బదులు పలుకును ''నేను బ్రహ్మను
నేను యజ్ఞము నేను లోకము'' 1.5.61

జనకుడంతకు పూర్వమందున
చదివినదియును, చదువనిదియును
బ్రహ్మశబ్దము చేత సుతునకు
సంక్రమించును లోకమందున 1.5.62

జనకుడంతకు పూర్వమందున
చేసినట్టి శుభాశుభమ్ములు
యజ్ఞ శబ్దము చేత సుతునకు
సంక్రమించును విశ్వమందున 1.5.63

జనకుడంతకు పూర్వమందున
పొందినట్టి యశస్సుప యశము
లోక శబ్దము చేత సుతునకు
సంక్రమించును భువనమందున 1.5.64

బ్రహ్మ, యజ్ఞము, లోకమను మూ
డింట మనుజుని ధ్యేయ మిముడును
కొడుకు మూడిటి రూపమగుచును
తండ్రి భారము మోయుచుండును 1.5.65

ఈ రహస్యము తెలిసి ఉపదే
శమ్మునిచ్చెడి తండ్రి తన ప్రా
ణాలతో లోకమున పుత్రుని
యందు జేరిన యట్లుతెంచుము 1.5.66

సంన్యసించిన జనకుడంతకు
ముందు సేయని కర్మలున్నను,
పుత్రుడట్లుపదేశమొంది ర
క్షించు నాతని వాటి నుండియు 1.5.67

'పు' త్తనగ పూర్ణమ్ము సేయుట
'త్రః' యనగ రక్షించు టర్థము
కాని పుంనరకమ్ము కలదని
కల్లలాడుట సాహసమ్మగు 1.5.68

సర్వమును విడనాడి పోవుచు
తండ్రి పుత్రుని ద్వారమున ఈ
లోకమున వసియించు గావున
నతనిలో అమరత్వముండును 1.5.69

బుద్ధి పూర్వకముగను మనుజుం
డెవడు సంసారమును వీడునో
అతనినే భూరగ్నులందలి
దివ్య వాణి వరించ గల్గును 1 5.70

ధీరులగు సంన్యాసులనె ఆ
దివ్య వాణి వరించినందున
సార్థకములై వారి పలుకులు
సత్ఫలమ్ములొసంగుచుండును 1.5.71

ధీరుడై సంసార విషయము
లన్నిటిని త్యజయించు వానికి
దివమునందలి సూర్యునందలి
దివ్య మైన మనస్సు తోడగు 1.5.72

ధీరుడై సంసార విషయము
లన్నిటిని త్యజియించు వానిని
జల సుధాకరులందు నుండెడి
దివ్యమగు ప్రాణమ్ము జేరును 1.5.73

సంచరించిన, సంచరింపక
పోయినను ఆ ప్రాణ దేవత
అలసటెన్నడు పొందనేరదు
నాశమెన్నడు చెందనేరదు 1.5.74

సర్వ భూతము లే విధమ్ముగ
ప్రాణ దేవత గావనెంతురో
ఈ రహస్య మెరుంగు వానిని
ప్రాణదేవత యట్లు గాచును 1.5.75

ప్రాణదేవత కరుణ పొందిన
వాని విషయము నందు మానవు
లెంత ఏడ్చిననేమి? దుఃఖము
లాతనిని బాధింపనేరవు 1.5 76

ఎవరు సంన్యాసాశ్రమమ్మున
చేరుదురో పుణ్యములు వారిని
చేరు, బాధలు వారినంటవు
వారు దేవతలై చరింతురు 1.5.77

చిత్రమగు ఈ సృష్టి లోపల
ఇంద్రియమ్ముల తీరు గాంచిన
దేని పనినది ఆచరించెడి
నియమమొక్కటి గోచరించును 1.5.78

వాణి పలుకగ, చెవియు వినగను
కన్ను చూడగ వ్రతము గైకొని
ఒకటి కంటెను ఒకటి మించిన
స్పర్థతో పనులాచరించెను 1.5.79

ఇంద్రియమ్ముల వ్రతమెరింగిన
మృత్యువాక్రైకదాని తాకగ
వాణి పలుకగ, చెవియు వినగను
కన్ను చూడగ లేకపోయెను 1.5 80

కాని దేహము లోని ప్రాణము
అలసి తన పని మానకుండుట
చూచి అది తమ కంటె శ్రేష్ఠ
మ్మని గ్రహించినవింద్రియమ్ములు 1.5 81

మాటలాడుచు వాక్కు, కనుచును
కన్ను, వినుచును చెవులు కూడా
అలసి పోవును కాని ప్రాణము
అలసి తన పని మాన దెప్పుడు 1.5 82

కదిలినను మరి కదలకున్నను
అలసటెరుగని దొక్క ప్రాణమె
కనుక ప్రాణము రూపు దాలిచి
ఇంద్రియమ్ములు ప్రాణమనబడు 1.5.83

ప్రాణ దేవత కరుణ చేతనె
అగ్ని దేవత, సూర్య దేవత
చంద్ర దేవత వ్రతము గైకొని
లోకమున వెలుగొందుచున్నవి 1.5.84

ఇంద్రియమ్ముల నడుమ ప్రాణ
మ్ముండు నట్లుగ అగ్ని మొదలగు
దేవతాతతి నడుమ వాయువు
సంస్థితమ్మై యొప్పు చున్నది 1.5.85

అన్యదేవతలస్తమించిన
అస్తమించును గాని వాయువె
అస్తమించని ప్రాణదేవత
అదియునెప్పుడు కదలు దేవత 1.5.86

సూర్యుడీ ప్రాణమ్ము చేతనె
పొడుచుచుండును క్రుంకుచుండును
కనుకనే దేవతలు దానిని
స్వీయ ధర్మము చేసుకొన్నవి. 1.5.87

ప్రాణమే ఈ రోజు రేపని
పలుకుచుంచురు లోకమందున
కనుక మనమీ ప్రాణ వ్రతమును
దృఢముగా పాటింప వలయును 1.5.88

దేహమున ప్రాణమ్మపాన
మ్మెటుల సాగునొ తెలిసి మనుజుడు
ప్రాణమును లక్ష్యమున నిలిపిన
మృత్యువతనిని పట్ట జాలదు 1.5.89

ప్రాణమెట్టుల జీవితాంతం
బుండు, నట్టుల లక్ష్య సిద్ధిని
గాంచుటుచితమ్ము,అపుడె ప్రాణ మ
నోజ్ఞ సాలోక్యత లభించును 1.5.90

## 6. నామరూప భిన్నతలో ఆత్మ - ప్రాణమేసత్

సృష్టిలో మన కనుల బడియెడి
వస్తు సంతతి నంతయును నా
మమ్ము, రూపము, కర్మమనియెడి
త్రికమునందే చేర్చ వచ్చును 1.6.1

కంటికగుపడు వస్తురూపమె
రూప; మా రూపమున కొప్పిన
యట్లు వాణియె పేరు పెట్టును
ఆ పేరునే నామమందుము 1.6.2

నామములు పుట్టించు వాణియె
ఏకతను సాధించు వాణియె
బ్రహ్మమై తనలోన నామము
లెల్ల ధారణ జేయు వాణియె 1.6.3

రూపములు పుట్టించు నేత్రమె
ఏకతను సాధించు నేత్రమె
బ్రహ్మమై తనలోన రూపము
లెల్ల ధారణ జేయు నేత్రమె 1.6.4

కర్మలను పుట్టించు నాత్మయె
ఏకతను సాధించు నాత్మయె
బ్రహ్మమై తనలోన కర్మల
నెల్ల ధారణ జేయు నాత్మయె 1.6.5

కనుల కగుపడనట్టి కర్మా
త్మక జగత్తును జాగృతమ్మగు
నటుల జేయునదాత్మయే, విష
మతకు సమతను గూర్చు నాత్మయె 1.6 6

పిండ గతమగు వాణిలో బ్ర
హ్మాండ గతమగు పేరు జేరును
పిండగతమగు కంటిలో బ్ర
హ్మాండగతమగు రూపు జేరును 1.6.7

పిండగతమగు ఆత్మలో బ్ర
హ్మాండ గతమగు కర్మ జేరును
వాణి చక్షువు రెండు కూడా
ఆత్మతోనే కూడి యుండును 1.6.8

ఆత్మ ఒక్కటి సత్ పదార్థము
సత్య రూపములైన చక్షువు,
వాణియును తన్నావరింపగ
నలరుచుండును తనువు లోపల 1.6.9

చెక్కు చెదరక సంచరించెడి
ప్రాణమాత్మకు భౌతికాకృతి
పేరు వాణికి భౌతికాకృతి
రూపు కంటికి భౌతికాకృతి 1.6.10

★ ★ ★

# ద్వితీయాధ్యాయం

## 1. గార్గ్యునికి అజాత శత్రుని బ్రహ్మోపదేశం

దృప్త బాలాకీయనంబడు
గార్గ్యుడుండెను పూర్వ యుగమున
బ్రాహ్మణుడ నే ననుచు గర్వా
ధిక్యమున చరియించుచుండెను 2.1.1

ఒక్క రోజున కాశిరాజు న
జాత శత్రుని గాంచి ఆతడు
నీకు బ్రహ్మము గూర్చి తెలుపుదు
ననుచు గర్వము తోడ పలికెను 2.1.2.

''ఇట్టి పలుకులు పలికినందుకు
ఈయ వలయును నీకు లక్షలు
బ్రహ్మ విద్యను గోరి జనకుని
గాంతు రేలకొ పిచ్చి జనములు?'' 2.1.3

నర్మ గర్భము గాగ పలికిన
రాజు పలుకుల అర్థమెరుగక
గర్గజుండాదిత్య పురుషుడు
బ్రహ్మమని వక్రోక్తులాడెను 2.1.4

సృష్టిలో అలరారు భూతము
లందు సూర్యుడు శ్రేష్ఠుడనియెడి
శాస్త్ర వచనము మది దలంచుచు
రాజు పలికెను కాదు కాదని 2.1.5

రాజు పలికిన పలుకులొప్పక
శీత కిరణుండైన చంద్రుని
బ్రహ్మగా భావింతునేనని
గార్గ్యుడాడెను గర్వమెసగగ 2.1.6

వెన్నెలనియెడి ధవళ వస్త్రము
దాల్చి వెలిగెడి సోమ రాజును
జడముగా నే దలతుననుచును
రాజు పలికెను నిర్భయమ్ముగ 2.1 7

రాజు పలికిన పలుకులొప్పక
లోకమున విద్యుత్తు పురుషుని
బ్రహ్మగా కొనియాడ గలనని
గార్గ్యుడాడెను గర్వమెసగగ 2.1.8

జగములో విద్యుత్తు వెలిగెడి
జడ పదార్థము, శాస్త్రమెప్పుడు
సత్యమును ప్రకటించుననుచును
రాజు పలికెను నిశ్చయమ్ముగ 2.1.9

రాజు పలికిన పలుకు లొప్పక
గగన పురుషుని బ్రహ్మమనుచును
గార్గ్యుడాడె నసత్యవచనము
కాశిరాజుకు వింత దోపగ 2 1.10

పూర్ణమే యగు గాక గగనము
అది ప్రవర్తన లేని ద్రవ్యము
పలదు మిథ్యా వచనమనుచును
రాజు పలికెను నిశ్చయమ్ముగ 2.1.11

రాజు మాటలు సరకు సేయక
వాయు పురుషుని బ్రహ్మమనుచును
గార్గ్యుడాడె నసత్యవచనము
రాజు బుద్ధికి వింత దోపగ 2.1.12

ఇంద్రశబ్దము తోడనొప్పుచు
అడ్డు లేనటువంటి గతితో
కదల నేర్చిన వాయువెప్పుడు
బ్రహ్మగాదని రాజు పలికెను 2.1.13

రాజు పలుకులు లెక్క వెట్టక
అగ్నిపురుషుని బ్రహ్మమంచును
గార్గ్యుడాడెనసత్య వచనము
రాజు మనసుకు బాధ కలుగగ 2.1.14

సహన శక్తిని దాల్చి సర్వము
కాల్చ గల్గిన యంత మాత్రన
అగ్ని బ్రహ్మమ్మెట్లులగునని
రాజు పలికెను గార్గ్య తోడను 2.1.15

శాస్త్రగతిని అతిక్రమించక
రాజు పలికెడి పలుకులను విని
జలపురుషుడే బ్రహ్మమనుచును
గార్గ్యుడాడె నసత్యవచనము 2.1.16

జలము మనకనుకూల తత్త్వము
సర్వులకు రుచిగానార్చునట్టిది
అంత మాత్రము చేత బ్రహ్మము
కాదు లెమ్మని రాజు పలికెను 2.1.17

రాజు మాటల లోని అర్థము
తెలియనేరని గార్గ్యుడద్దము
లోన కనబడు బొమ్మ పురుషుని
బ్రహ్మమని వాదోక్తులాడెను 2.1.18

కాంతివంతంబైన దర్పణ
మందు గనబడునట్టి ప్రతిబిం
బమ్ము బొమ్మగు గాని బ్రహ్మ
మ్మెట్టులగునని రాజు పలికెను 2.1.19

నడిచి ముందుకు సాగు మనుజుని
చెవులలో బడునట్టి శబ్దము
బ్రహ్మమని గార్గ్యుండు పలికెను
రాజు మాటలు లెక్క సేయక 2.1.20

శబ్దమనునది సృష్టిలో ఆ
కాశ గుణమగు కాని బ్రహ్మము
కాదు కాదని రాజు గార్గ్యుని
తోడ పలికెను నిశ్చయమ్ముగ 2.1.21

రాజు మాటలు లెక్క సేయని
గార్గ్యుడంతట గర్వమెసగగ
దిక్పురుషుడే బ్రహ్మమంచును
మూర్ఖుడై వాదమ్ము చేసెను 2.1.22

ఆత్మలందు వసించు బ్రహ్మమె
అన్ని దిక్కుల వెలుగుచుండును
దిక్కు జడమగు గాని బ్రహ్మము
కాదు కాదని రాజు పలికెను 2.1.23

సత్యమును వచియించు రాజును
లెక్క సేయని గార్గ్యుడప్పుడు
పలికె ఛాయా పురుషుడే పూ
జింప గలిగిన బ్రహ్మమంచును 2.1.24

నరుడు ఛాయా పురుషునెప్పుడు
మృత్యువని భావింప వలయును
ఛాయ బ్రహ్మమ్మనుట శాస్త్రము
కంటె భిన్నంబైన వచనము 2.1.25

రాజు పలికిన సత్య వచనము
సరకు సేయని గార్గ్యుడప్పుడు
మన శరీరములోని పురుషుడు
బ్రహ్మమని వాదోక్తులాడెను 2.1.26

రాజు గార్గ్యుని పలుకు కాదని
ఆత్మనెప్పుడు ఆత్మవంతము
గాదలంచిన వాడు జగమున
ఆత్మవంతుండై వెలుంగును 2.1.27

దేహమున నివసించు ఆత్మ మ
రొక్క ఆత్మను కోరుచుండును
లేనిచో అది ఏమి సేయగ
జాలదని సత్యమ్ము పలికెను 2.1.28

బ్రహ్మ విషయమునందు సందే
హమ్ము నొందుచు మౌనముద్ర వ
హించు గార్గ్యుని జూచి యాతని
తోడ నృపుడీ గతి వచించెను 2.1.29

''నీకు తెలిసిన దింత మాత్రమె
తెలుసుకోవలసింది వేరుగ
నున్న'' దని పలుకంగ నాతడు
దీక్షనిమ్మని అడిగె రాజును 2.1.30

''బ్రహ్మమెరిగిన వాడు బ్రాహ్మణుం
డతడు క్షత్రియు జేరి బ్రహ్మము
గూర్చి ఏ గతి అడుగునయ్యా?
ఐన నేమి వచింతు నీకును'' 2.1.31

అనుచు గార్గ్యుని వెంటనిడుకొని
నిదుర నోయెడి నరుని చెంతకు
చేరి యాతని భిన్న భిన్నము
లైన పేర్లతొ పిలవసాగెను 2.1.32

కాని యాతడు లేవకుండిన
తట్టిలేపెను, చివరికాతడు
లేచి యుండుట చూచి కాశీ
రాజు గార్గ్యునితోడ ఇట్లనె — 2.1.33

''అయ్యా! ఈ విజ్ఞాన పురుషుడు
ప్రాణమెంతో అలసి పోవుట
చేత జాగ్రత్ స్వప్నదశలను
క్రమముగా తానధిగమించెను 2.1.34

పూర్వమింద్రియముల కొసంగిన
జ్ఞానమును తన జ్ఞాన బలమున
సంగ్రహించియు తనదు హృదయా
కాశమందే నిదుర వోయెను 2.1.35

లోకమున నిద్రించు వానిని
చూసి యితరులు 'స్వపితి' యందురు
వాస్తవమ్మున కితడు నిజరూ
పమ్ము లోపల చేరి యుండును 2 1.36

అప్పుడీ విజ్ఞాన పురుషుడు
ప్రాణములతో పాటు వాక్కును
నేత్రమును శ్రోత్రమును మనసును
లాగి తనలో పట్టి యుంచును 2.1.37

తన్ను తానెరుగంగ లేని సు
షుప్తి కంటెను భిన్నమగు స్వ
ప్నమ్ములో విహరించు ఆత్మకు
కలుగుచుండెడి జగములెన్నో 2.1.38

స్వప్న లోకము లోన ఈతడు
చక్రవర్తై జ్ఞాన ఖనియై
గొప్ప వాడై సేవకుండై
వ్యవహరించును వెంట వెంటనె 2.1.39

సేవకాతతి వెంటనిడుకొని
రాజు రాజ్యములోన తిరిగెడి
రీతి జీవుండింద్రి యమ్ముల
తోడ దేహమునందు తిరుగును 2.1.40

గాఢ నిద్రా సమయమందున
తెలియడీ విజ్ఞాన పురుషుం
డెక్కడుండునొ? ఏమి సేయునొ?
ఏమియగునో? కొంచెమైనను 2.1.41

హృదయ కోశము నుండి వెల్వడు
చుండు డెబ్బది రెండు వేలహి
తానాడులు శరీరమున వ్యా
పించుచు పురీతతములనబడు 2.1.42

ఈ పురీతత నాడులన్నిటి
లో సుషుమ్న యె శ్రేష్ఠమైనది
దానిలో విజ్ఞాన పురుషుడు
చేరి ఆనందించు చుండును 2.1.43

బాలకుండును, చక్ర వర్తియు
యోగి వరుడానంద రసమున
నిదుర వోయెడి రీతి ఆత్మ సు
షుప్తిలో నిద్రించుచుండును 2.1.44

తంతువాధారమ్ముగా సా
లీడు కిందికి మీది కేగెడి
సరణి జీవుడు సంచరించును
జాగ్రదాది యవస్థలందున 2.1.45

అగ్ని ముఖమున నిప్పు రవ్వలు
లేచునట్లుగ ఆత్మ నుండియె
లేచి జ్ఞానమ్మింద్రియమ్ముల
చేతనమ్మొనరించు చుండును 2.1.46

ఈ శరీరము లో వసించెడి
ఆత్మయే విజ్ఞాన ఘనమగు
తేజరిలు బ్రహ్మాండమందలి
బ్రహ్మమే విజ్ఞాన ఘనమగు 2.1.47

చేతనమ్మగు బ్రహ్మమే సూ
ర్యాది లోకములను సృజించును
ఉపనిషత్తులు దానినే స
త్యస్య సత్యమ్మని వచించును 2.1.48

పిండగతమగు ఆత్మసత్యము,
ఆత్మ కాత్మె వెలుగు నీబ్ర
హ్మాండ గతమగు ఆత్మ, దానిని
సత్యమునకే సత్యమందురు 2.1.49

## 2. ప్రాణము – ఆత్మ

ఆత్మయే శిశు రూప వత్సము
అన్నమే బంధించు దామము
చెవులు కన్నులు నాల్క ముక్కులు
సప్త శత్రువు లగును దానికి 2.2.1

ఇంద్రియమ్ముల నడ్డగించున
దొక్క ప్రాణమె కనుక ఆత్మను
ప్రాణ రూపమ్మైన మేకున
బాగుగా బంధించ వలయును 2.2.2

ప్రాణమనియెడి కొయ్యకాత్మను
కట్టి యింద్రియ సంగ దోషము
లంటు కుండెడి వాని కేడు న
శింప జాలని శక్తు లబ్బును 2.2.3

ప్రాణముంబలె ఆత్మ రూపం
బైన శిశువును వేడ్కతో ని
క్షేపముంబొనరించు నాతని
అక్షిలో దేవతలు నిలుతురు 2.2.4

కంటి లోపలి ఎర్ర జీరల
లోన రుద్రుడు, జల కణమ్ముల
లోన మేఘుడు, పాపలో ఆ
దిత్యుడుండియు గాచుచుందురు 2.2.5

నలుపు లోపల అగ్ని, తెలుపున
నింద్రుడలరగ, క్రింది రెప్పన
భువియు మరి పై రెప్పన దివియు
నిలిచి యెప్పుడు గాచుచుండును 2 2.6

నిర్మలమ్మగు ప్రాణమట్లుగ
ఆత్మనుంచిన వాని నేత్రము
నందు దేవతలున్న యట్టుల
శిరమునను సప్తర్షులుందురు 2.2.7

తత్త్వవేత్తలు దీనినెంతయు
సుందరమ్ముగ పోల్చి చెప్పిరి-
''సోమ రసమును పోసి నింపిన
పాత్ర ఒక్కటి ఒప్పుచున్నది 2.2.8

సర్వ రసముల తోడ నిండిన
చమస తలక్రిందై వెలుంగును
దాని కడ సప్తర్షులుందురు
వాణి బ్రహ్మము వ్యాఖ్యసేయగ 2.2.9

మస్తకమ్మే పాత్ర యనునది
ప్రాణరసమే నిండి యున్నది
చెవులు కన్నులు ముక్కు పుటములు
నాల్కయే సప్తర్షులనునవి 2.2.10

చెవులు గౌతమ భరద్వాజులు,
కనులు విశ్వామిత్ర జమద
గ్నులు, నాసికా పుటంబులు వ
శిష్ఠ కశ్యపులు, అత్రి జిహ్వయె 2.2.11

'అత్రి' శబ్దము 'అత్తి' భవమగు
'అత్తి' యనగ భుజియించుటర్థము
జిహ్వ తో వస్తువుల్ తిన బడు
నీ రహస్యము తెలియవలయును 2.2.12

నేత్రమందున సృష్టి దేవత
యుండి కొరతలు దర్శిసన్లే
శిరమునను సప్తర్షులుండయు
యోగి స్ఫురింపను గాంచుచుందురు 2.2.13

## 3. బ్రహ్మదర్శనం

బ్రహ్మమునకు రెండు రూపులు
మూర్తమనెడు నమూర్తమనియును
మర్త్యమనియు నమృతమనియు ప్ర
త్యక్షమనియు పరోక్షమనియును 2.3.1

వాయురాకాశముల కంటెను
భిన్నమైనది మూర్త రూపము
సూర్యుడే ఆ మూర్త రూపము
బ్రహ్మమునకు ప్రత్యక్ష రూపము 2.3.2

సృష్టిలో ప్రతి మూర్త రూపము
నందు బ్రహ్మము గోచరించును
మూర్త రూపముల మొత్తానికి
చరమ సీమయు సూర్యదేవత 2.3.3

ప్రాణికోటి హితమ్ము గోరుచు
బ్రహ్మ బ్రహ్మాండము సృజించెను
సృష్టిలో గల మూర్త రూపము
లంటకనె తానుండ నేర్చెను 2.3.4

మూర్త రూపములందు శ్రేష్ఠుం
డైన సూర్యుడె ప్రతి దినమ్మును
బ్రహ్మమును లోకమ్ములకు ప్ర
త్యక్ష పరిచెడి మర్త్య రూపము 2.3.5

వాయురాకాశములు రెండును
బ్రహ్మమునకమూర్త రూపములు
బ్రహ్మమన సామాన్యుడా? -ఈ
సౌర మండల సార్వభౌముడు! 2.3.6

సకల మూర్తా మూర్త రూపము
లందు బ్రహ్మము వ్యాపకుండై
యోగులకు కనిపించుచుండును
కాని వాటికి అంటడెప్పుడు 2.3.7

పిండ గతమగు ప్రాణ దేవత
హృదయ గతమగు గగన దేవత
రెండు కూడా బ్రహ్మమునకు ప
రోక్ష రూపములగుచునొప్పును 2.3.8

ఇట్టి రూపమ్ముల రసమె కుడి
నేత్రమున కనిపించు పురుషుడు
తొంగి చూచిన యటులతోచు ప
రోక్ష పురుషున కక్షి రసమగు 2 3.9

నిర్వికల్ప సమాధి లోపల
నిలిచి ధ్యానము సేయు యోగికి
బ్రహ్మ సాక్షాత్కార మగును వి
భిన్నమగు ఆకృతులతోడను ! 2.3.10

కుంకుమాకృతిలోని ఉడుపుగ,
పాండు వర్ణములోని ఉన్నిగ,
ఇంద్రగోపము, అగ్ని తేజము,
శ్వేత కమలము, మెరుపు తీగగ 2.3.11

అంతకంతకు వెలుగు అమృతా
కారమిది యని చెప్పజాలక
నిత్య సాధకులైన యోగులె
'నేతి నేత' ని పలుకుచుందురు 2.3.12

## 4. మైత్రేయీ యాజ్ఞవల్క్యుల సంవాదం

యాజ్ఞవల్క్య మహర్షి సంన్యా
సాశ్రమమ్మును స్వీకరించుచు
ఆస్తి విభజన సేతుననె మై
త్రేయి కాత్యాయనుల తోడను 2.4.1

''సర్వ సంపద లాశ్రయింపగ
సుఖము గూర్చెడి భూమియంతయు
నాది యైనను ముక్తియెట్టుల
దొరుకు?'' నని మైత్రేయి యడిగెను 2.4.2

''డబ్బుగల వాడెట్లు జగమున
సుఖము గా జీవింప గలడో
నీవునట్లే యుండ గల్గుదు
వంత మాత్రమె, ముక్తి కలుగదు'' 2.4.3

''స్వామి! నేనెద్దానితో నవ్వు
తత్త్వమును సాధింప లేనో
దానితో నాకేమి లాభము?
ముక్తి మార్గము చూప గోరెద'' 2.4.4

''నేటికిని ప్రియురాల! ఎన్నో
వెంత ప్రియముగ అడుగుచుంటివి!
ఆత్మతత్త్వము నెరుగ జెప్పెద
శ్రద్ధతో ఆలించ వలయును 2.4.5

స్వీయ కామన గోరు నాథుడు
ప్రీతి పాత్రుడు కాడు భార్యకు
భార్య కామన దీర్చు నాథుడె
భార్యకెప్పుడు ప్రీతి పాత్రుడు 2.4.6

స్వీయ కామన గోరు భామిని
ప్రేమ రూపిణి కాదు భర్తకు
భర్త కామన దీర్చు భార్యయె
భర్తకెప్పుడు ప్రేమ రూపిణి 2.4.7

స్వీయ కామన గోరు జనకుడు
ప్రీతి పాత్రుడు కాడు సుతునకు
సుతుని కామన దీర్చు జనకుడె
సుతునికెప్పుడు ప్రీతి పాత్రుడు 2.4.8

స్వీయ కామన గోరు విత్తము
ప్రీతి పాత్రము కాదు – ఆత్మకు
ఆత్మ కామన దీర్చు విత్తమె
ఆత్మకెప్పుడు ప్రీతి పాత్రము 2.4.9

స్వీయ కామన గోరు బ్రాహ్మణుం
డగునె జనులకు ప్రీతి పాత్రుడు?
జనుల కామన దీర్చు బ్రాహ్మణుం
డగును జనులకు ప్రీతి పాత్రుడు 2.4.10

స్వీయ కామన గోరు క్షత్రియుం
డగునె జనులకు ప్రీతి పాత్రుడు?
జనుల కామన దీర్చు క్షత్రియుం
డగును జనులకు ప్రీతి పాత్రుడు 2.4.11

స్వీయ కామన గోరు లోకులు
ప్రీతి పాత్రులు కారు పరులకు
పరుల కామన గోరు లోకులె
పరులకెప్పుడు ప్రీతి పాత్రులు 2.4.12

స్వీయ కామన గోరు దేవత
లగునె జనులకు ప్రేమ పాత్రము ?
జనుల కామన దీర్చు దేవత
లగును జనులకు ప్రేమ పాత్రము 2.4.13

స్వీయ కామన గోరు భూతము
లగునె జనులకు ప్రీతిపాత్రము?
జనుల కామన దీర్చు భూతము
లగును జనులకు ప్రీతిపాత్రము 2.4.14

స్వీయ కామన గోరు సర్వము
ప్రీతి పాత్రము కాదు జనులకు
జనుల కామన దీర్చు సర్వమె
జనులకెప్పుడు ప్రీతి పాత్రము 2.4.15

ఆత్మ కామన గోరి సర్వము
ప్రీతి పాత్రము కాదలంచును
ఆత్మయే భువనమ్ము లోపల
అందరికి తెలియంగ దగినది 2.4.16

ఆత్మనే దర్శింప వలయును
ఆత్మనే ఆలింప వలయును
ఆత్మనే చింతింప వలయును
ఆత్మనే ధ్యానింప వలయును 2.4.17

ఆత్మనే కని వినుట చేతను
ఆత్మ యందలి తలపు చేతను
ఆత్మ విజ్ఞానమ్ము చేతను
సర్వమును తెలియంగ వచ్చును 2.4.18

ఆత్మ కంటెను జ్ఞానమును భి
న్నమ్ముగా లెక్కించు వానిని
జ్ఞానమే త్యజియించుచుండును
కనుక ఆత్మను తెలియవలయును 2.4.19

ఆత్మ కంటెను క్షాత్రమును భి
న్నమ్ముగా లెక్కించు వానిని
క్షాత్రమే త్యజియించు చుండును
కనుక ఆత్మను తెలియ వలయును 2.4.20

ఆత్మ కంటెను లోకముల భి
న్నమ్ముగా లెక్కించు వానిని
లోకములు త్యజియించుచుండును
కనుక ఆత్మను తెలియ వలయును 2.4.21

ఆత్మ కంటెను దేవతల భి
న్నమ్ముగా లెక్కించు వానిని
దేవతలు త్యజియించుచుండును
కనుక ఆత్మను తెలియ వలయును 2.4.22

ఆత్మ కంటెను భూతముల భి
న్నమ్ముగా లెక్కించు వానిని
భూతములు త్యజియించుచుండును
కనుక ఆత్మను తెలియ వలయును 2.4.23

ఆత్మ కంటెను సర్వమును భి
న్నమ్ముగా లెక్కించు వానిని
సర్వమే త్యజియించుచుండును
కనుక ఆత్మను తెలియ వలయును 2.4.24

దుందుభిని మ్రోగించినప్పుడు
పుట్టు ధ్వనులను పట్ట నెంచిన
దుందుభైనను లేక దానిని
కొట్టు వానిని పట్ట వలయును 2.4.25

శంఖమును పూరించినప్పుడు
పుట్టు రవములు పట్ట నెంచిన
శంఖమైనా పట్టుకో వలె,
శంఖ దారిని పట్టుకో వలె 2.4.26

వీణియను మ్రోగించినప్పుడు
పుట్టు ధ్వనులను పట్టగోరిన
వీణనైనా పట్ట వలయును,
వైణికుని పట్టంగ వలయును 2.4.27

వేణువును మ్రోగించినప్పుడు
పుట్టు ధ్వనులను పట్టనెంచిన
వేణువును పట్టంగ వలయును,
వేణుధరు పట్టంగ వలయును 2.4.28

ఇట్టులే సంసారమును ప
ట్టంగ నెంచిన ఇంద్రియమ్ముల
పట్టవలయును, పిదప ఆత్మను
తెలివితో పట్టంగ వలయును 2.4.29

తడిసి కట్టెలు మండునప్పుడు
చూడవో మైత్రేయి! పొగలను
అరసి చూడగ నాల్గు వేదము
లాత్మ నిశ్వాసమ్ములనబడు 2.4.30

త్వక్కు స్పర్శలకాశ్రయమ్మగు
ముక్కు గంధ సమాశ్రయమ్మగు
జిహ్వ రసముల కాశ్రయమ్మగు
కన్ను రూప సమాశ్రయమ్మగు 2.4.31

చెవులు రవముల కాశ్రయమ్మగు
మనసు కోర్కెల కాశ్రయమ్మగు
వాణి ఋక్కుల కాశ్రయమ్మగు
ఆత్మ వాణికి ఆశ్రయమ్మగు 2.4.32

ఉప్పు – నీటంగలిసి నీటిని
ఉప్పు జేసిన యంత మాత్రన
ఉప్పు, నీరూ ఒక్కటగునే ?
బ్రహ్మ, సృష్టీ ఒక్కటగునే ? 2 4.33

వినుము ఓ మైత్రేయి! ఆత్మ అ
నంతమై విజ్ఞాన ఘనమై
భూతములతో ప్రకటమై మరి
వాని లోనే దాగి యుండును 2.4.34

ఆత్మ యీ భూతముల తోడను
ప్రకటమగుచున్నంత వరకే
సంజ్ఞ అనునది, విడిచిపోయిన
పిదప దానికి సంజ్ఞ యుండదు" 2.4.35

"ఆత్మ భూతములను త్యజించిన
సంజ్ఞ యుండదటంచు నన్నిటు
మోహ పెట్టుదురెందుకని మై
త్రేయి అడిగెను యాజ్ఞవల్క్యుని 2.4.36

అందుకాతడు – "కలత వెట్టగ
నీకు చెప్పుట లేదు, ముందరి
విషయ మెరుగగ దీని చెప్పుట
సముచితమ్మని విన్నవించితి 2.4.37

ఆత్మ భూతములందు ప్రకటం
బైన యప్పుడె ద్వైతమ్మగు, ద్వై
తమ్మునందే ఆత్మ విషయము
తెలిసికొనుటకు వీలు కలుగును 2.4.38

ఒక్కరినొక్కరు తెలిసికొందురు
ఒక్కరినొక్కరు చూచుకొందురు
ఒకరినొక రాలించుకొందురు
ఒకరికొక్కరు చెప్పుకొందురు 2.4.39

భూత సంతతి నుండి వేరై
ఆత్మ తన సంపూర్ణ రూపము
లోన జేరిన దేనితో మరి
దేని నాఘ్రాణించగలుగును ? 2.4.40

దేని దేనితొ చూడగలుగును?
దేనితో ఆలించగలుగును?
దేని దేనితొ చెప్పగలుగును?
దేనితో మరి తెలియగలుగును ? 2.4.41

ఆత్మచే సర్వమ్ము తెలియును
ఆత్మచే గుర్తింపు గలుగును
కాని ఆత్మను తెలియుటెట్టుల ?
తెలియు వానిని తెలియుటెట్టుల ? 2.4.42

భూత జాతము నుండి ఆత్మను
వేరు జేసిన సంజ్ఞ యుండదు
ద్వైతమందే ఆత్మ తత్త్వము
తెలియ గల్గుట సులభ సాధ్యము 2.4.43

## 5. యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి బోధించిన మధు విద్య - బ్రహ్మవిద్య

పృథివి మధువగు ప్రాణి కోటికి
ప్రాణులన్నియు మధువు పృథివికి
పృథివిలో వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.1

ఇంద్రియములకు నాయకుండై
పిండమున వెలుగొందుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియ వలె జీవాత్మ గానే 2.5.2

జలము మధువగు ప్రాణి కోటికి
ప్రాణులన్నియు మధువు నీటికి
జలములో వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.3

రైతసస్తేజోమయుండై
పిండమున వెలుగొందుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మగానే 2.5.4

అగ్ని మధువగు ప్రాణి కోటికి
ప్రాణులన్నియు మధువు – అగ్నికి
అగ్నిలో వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.5

వాఙ్మయస్తేజోమయుండై
పిండమున వెలుగొందుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మ గానే 2.5.6

గాలి మధువగు ప్రాణి కోటికి
ప్రాణులన్నియు మధువు గాలికి
గాలిలో వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.7

ప్రాణమయ తేజోమయుండై
పిండమున వెలుగొందుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మగానే 2.5.8

ప్రాణి కోటికి మధువు సూర్యుడు
సూర్యునకు మధువగును ప్రాణులు
సూర్యునిలొ వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.9

చాక్షుషస్తే జోమయుండై
పిండమున వెలుగొందుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మగానే 2.5.10

దిశలు మధువగు ప్రాణి కోటికి
ప్రాణులన్నియు మధువు దిశలకు
దిశలలో వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.11

శ్రోత్రమునకధి నాయకుండై
పిండమున వెలుగొందుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మ గానే 2.5.12

ప్రాణి కోటికి మధువు చంద్రుడు
చంద్రునకు మధువగును ప్రాణులు
చంద్రునిలొ వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.13

మానసస్తేజోమయుండై
పిండమున వెలుగొందుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మగానే 2.5.14

ప్రాణులకు విద్యుత్తు మధువగు
మధువు విద్యుత్తునకు ప్రాణులు
మెరుపులో వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.15

తైజ సస్తేజోమయుండై
పిండమున వెలుగొందు చుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మగానే 2.5.16

ప్రాణికోటికి మధువు మేఘము
మేఘమునకా మధువు ప్రాణులు
మేఘమున వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.17

సావరస్తేజోమయుండై
పిండమున వెలుగొందుచుండెడి
అమృతరూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మగానే 2.5.18

నింగి మధువగు ప్రాణి కోటికి
ప్రాణులన్నియు మధువు నింగికి
నింగిలో వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమును కాత్మ 2.5.19

హృదయ గగనములోన నిలిచియు
పిండమున వెలుగొందుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మగానే 2.5.20

ప్రాణికోటికి మధువు ధర్మము
ధర్మము నకును మధువు ప్రాణులు
ధర్మమున వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.21

పిండగతమగు ధర్మమునకును
నాయకుండై వెలుగుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మగానే 2.5.22

ప్రాణికోటికి మధువు సత్యము
సత్యమునకును మధువు ప్రాణులు
సత్యమున వ్యాపించు తేజో
మయుడు బ్రహ్మాండమున కాత్మ 2.5.23

పిండగతమగు సత్యమునకును
నాయకుండై వెలుగుచుండెడి
అమృత రూపుండైన పురుషుని
తెలియవలె జీవాత్మగానే 2.5.24

సర్వమున వ్యాపించు బ్రహ్మ
మ్మాత్మయగు బ్రహ్మాండమునకును
ఏక దేశిగ వెలుగు పురుషుం
డాత్మయగు నీ పిండమునకును 2.5.25

విశ్వమనియెడి చక్రమునకును
నాభినేములు బ్రహ్మమేయగు
అన్ని లోకములన్ని దేవత
లందులో గల ఆకులేయగు ॥ 2.5.26

నేను నీ కలరంగ జెప్పిన
విద్యనే మధు విద్య యందురు
దధ్యజుండీ విద్య నశ్వికు
మారులకు దయ తోడ జెప్పెను 2.5.27

చిమ్మ చీకటిలోన జలదము
మెరిసి వర్షము కురిసినట్లు– అ
విద్యాంధకారమ్ములో మధు
విద్య శాంతి నొసంగ జాలును 2.5.28

పరమ పురుషుడు జీవ కోటికి
రెండు కాళ్లను నాల్గు కాళ్లను
కలుగు జంతు శరీరములు రచి
యించి ఉపకారమ్మొనర్చెను 2.5.29

అంతటను వ్యాపించి యుండెడి
పరమ పురుషుడె గూటి లోపలి
పక్షివోలె పురమ్ములందున
భద్రముగ శయనించియుండును 2.5.30

పురములందున నిలిచి వెలిగెడి
బ్రహ్మమే అన్నిటిని వెలుపల
నిలిచి కప్పును, ఆతడే అ
న్నిటిని లోపల నిలిచి కప్పును 2.5.31

ఆత్మ ఏ రూపమున జేరిన
దాని రూపమె గలుగు దానికి
కాని దాని యధార్ధ రూపము
మారి పోదే నాటికైనను 2.5.32

జీవుడక్కట మాయలోబడి
ఎన్నియో రూపములు దాల్చును
ముక్తి మార్గము నెరుగ జాలక
మూర్ఖుడై చరియించుచుండును 2.5.33

రూపములు వేలాది యున్నను
బ్రహ్మమును బంధింపజాలవు
శుద్ధమగు తన రూపముననే
బ్రహ్మమెప్పుడు వెలుగుచుండును 2.5.34

పరమ పురుషుని శుద్ధ రూపము
గణ్యమైనది, ముందు వెనుకలు
లేని యట్టిది, మరియు బాహ్యాం
తరములైనను లేని యట్టిది 2.5.35

అంతయును పరికింప గల్గిన
ఆత్మయే మహనీయ బ్రహ్మము
బ్రహ్మమును పరికింపగల్గిన
ఆత్మయే ధన్యాతి ధన్యము 2.5.36

యాజ్ఞవల్క్యుండట్లు బ్రహ్మము
గూర్చి ఉపదేశించి ''నా యను
శాసనమ్మిదిగోను'' డనుచు మై
త్రేయి కాత్యాయనుల విడిచెను 2.5.37

★ ★ ★

# తృతీయాధ్యాయం

## 1. జనకుని సభలో యాజ్ఞవల్క్య అశ్వలుల వివాదం

లోక కల్యాణార్థమై బహు
దక్షిణమ్మను పేర జనకుడు
యజ్ఞమును మొదలిడగ కురు పాం
చాల బ్రాహ్మణులరుగుదెంచిరి 3.1.1

అటుల వచ్చిన వారి జూడగ
రాజు మనమున వేడ్క గలిగెను
శ్రేష్ఠుడగు విద్వాంసుడెవరో
నిశ్చయమ్ముగ దెలియ వలెనని 3.1.2

తక్షణమ్మే వేయి గోవులు-
శృంగములకు సువర్ణ నాణెము
లంచితముగ పదేసి చొప్పున
కట్టినవి తెప్పించబడియెను 3.1.3

అప్పుడా జనకుండు వారిని
చూచి ''మీలో గొప్ప బ్రహ్మ
జ్ఞాని ఎవరో వారు గోవులు
తోలుకొని పోవచ్చు''ననియెను 3.1.4

కానియెవ్వరు గోవులను తర
లించు సాహస బుద్ధి జూపరు
యాజ్ఞవల్క్యుడు మాత్రమే తన
బ్రహ్మచారిని పిలిచి యిట్లనె- 3.1.5

'ఓయి సామశ్రవుడ! నీవీ
గోవులను మన ఆశ్రమమునకు
తోలుకొని పొ'మ్మనగ నాతం
డట్టులే సేయంగ బూనెను 3.1.6

కాని బ్రాహ్మణులెల్ల క్రోధము
బూని యాతని తిట్టుచుండగ
అశ్వలుండను వాడు జనక పు
రోహితుండు వచించెనిట్టుల- 3.1.7

''మమ్ము మించిన బ్రహ్మవేత్తలె!
ఐన మీకివె వందనమ్ములు
మేము గోవుల గోరువారమె
కాని మీరలు తోలుకొంటిరి 3.1.8

బ్రాహ్మణులలో మీరు మిక్కిలి
శ్రేష్ఠులని భావించినారో?
మేము మిమ్ములనడుగు ప్రశ్నల
కుత్తరమ్ము-లొసంగ వలయును 3.1.9

సృష్టిలో ఏ వస్తువైనను
మృత్యువునకే లొంగి ఉండగ
యజ్ఞ కర్తకు ముక్తి యెట్లగు
యాజ్ఞవల్క్య చెప్పవయ్యా!'' 3.1.10

''అగ్నిదేవత పిండమందున
వాణియై భాసిల్లుచుండగ
యజ్ఞమున ఉద్గాత వాణికి
అగ్ని రూపము మరల ఇచ్చును 3.1.11

పిండమును బ్రహ్మాండమందును
వాక్కు బ్రహ్మాండాగ్నియందును
కలుపుచును యజమాని మృత్యువు
మీద విజయము నొంద జాలును 3.1.12

పిండగత మౌ వాణియే బ్ర
హ్మాండ గతమౌ అగ్ని దేవత
వాణి క్రమముగ అగ్నిరూపము
నొందుటే అతిముక్తి యనబడు'' 3.1.13

''సృష్టిలోపలనున్నదంతయు
పగలు రాత్రులతోడ కలిసియు
నుండగా యజమానుడే గతి
ముక్తినొందును వాటి నుండియు'' 3.1.14

''సూర్య దేవత పిండమందున
చక్షువై భాసించుచుండును
యజ్ఞమున యజమాని కంటికి
హోత సూర్యుని రూపమొసగును 3.1.15

చక్షు రూప వ్యష్టి కొఱకే
దినము రాత్రములుండు మరి ఆ
దిత్య రూప సమష్టికెన్నడు
దినము రాత్రములుండ నేరవు 3.1.16

పిండమును బ్రహ్మాండమందును
చక్షువును – ఆదిత్యునందును
కలుపుచును యజమాని మృత్యువు
మీద విజయము నొంద జాలును 3.1.17

పిండ గతమౌ నేత్రమే బ్ర
హ్మాండ గతమౌ సూర్య దేవత
నేత్రమాదిత్య రూపమ్మును
పొందుటే అతి ముక్తియనబడు'' 3.1.18

''శుక్ల పక్షము, కృష్ణ పక్షము
సకల వస్తుచయమ్ములో వ్యా
పింపగా యజమాని యేగతి
ముక్తి నొందును వాటి నుండియు'' 3.1.19

''వాయు దేవత పిండమందున
ప్రాణమై భాసిల్లుచుండును
యజ్ఞమున ఉద్గాత దానికి
వాయురూపమ్మొసగుచుండును 3.1.20

పిండమును బ్రహ్మాండమందును
ప్రాణశక్తిని వాయువందును
కలుపుచును యజమాని మృత్యువు
మీద విజయము నొందుచుండును 3.1.21

పిండ గతమౌ ప్రాణమే బ్ర
హ్మాండ గతమౌ వాయు దేవత
ప్రాణదేవత వాయు రూపము
నొందుటే అతి ముక్తి యనబడు'' 3.1.22

''సృష్టి లోపల అంతరిక్షము
నిరవలంబంబగుచు నుండగ
దేనినాధారమ్ముగా గొని
యజ్ఞ కర్త విముక్తి నొందును?'' 3.1.23

''చంద్రుడే ఈ పిండమందున
మనసుగా భాసిల్లుచుండును
యజ్ఞమున యజమాని మనసుకు
హోత చంద్రుని రూపమొసగును 3.1.24

పిండమును బ్రహ్మాండమందును
మనసు చంద్రుని యందు నిమ్మగ
కలుపుచును యజమాని మృత్యువు
మీద విజయము నొందుచుండును 3.1.25

పిండ గతమౌ మానసము బ్ర
హ్మాండ గతమౌ చంద్ర దేవత
మనసు క్రమముగ చంద్ర రూపము
నొందుటే అతి ముక్తి యనబడు 3.1.26

స్వర్గమనగా ముక్తి, దానిని
పొందగోరిన కలుప వలయును
పిండమును బ్రహ్మాండమందున
వ్యష్టినేమొ సమష్టియందున'' 3.1.27

''యాజ్ఞవల్క్య! నేడు జరిగెడి
యజ్ఞక్రతువును చూచుచుంటివి-
ఎన్ని ఋక్కుల తోడ ఇయ్యది
పూర్తియగునో చెప్పగలవా?'' 3.1.28

మూడు ఋక్కుల తోడ ముగియును
మొదటి ఋక్కు పురోను వాక్యా
రెండవది యాజ్యా యనంబడు
మూడవది శస్యా యనంబడు 3.1.29

''మూడు ఋక్కులతోడ ఎవరిని
యజ్ఞకర్త జయింపగలుగును?''
''మూడు ఋక్కుల తోడ ప్రాణుల
మానసములు జయింపగలుగును'' 3.1.30

''యాజ్ఞవల్క్య! నేడు జనకుడు
సేయు యజ్ఞము చూచుచుంటివి-
ఎన్ని ఆహుతులొసగి అధ్వ
ర్యుండు క్రతువును పూర్తిసేయును?'' 3.1.31

''సమిధలను మండింపజేసెడి,
చటచటా శబ్దంబు జేసెడి,
అడుగు భాగము నందు జేరెడి
ఆహుతి త్రయమొసగి చేయును 3.1.32

మనుజ మాత్రుని జీవనమ్మును
యజ్ఞమని భావింపవచ్చును
అతడు చేసెడి నిత్యకర్మల
నాహుతిత్రయ మనగ వచ్చును 3.1.33

ఎట్టి కర్మల చేత మనుజుడు
దేవతల వలె వెలుగగలడో
అట్టి కర్మలు చేసియాతడు
దేవ లోకము గెలువ గలుగును 3.1.34

ఎట్టి కర్మల చేత బ్రతుకున
కొట్టుమిట్టాడంగవచ్చునొ
అట్టి కర్మల చేత మనుజుడు
పితృ లోకము గెలువ గలుగును 3.1.35

ఎట్టి కర్మల చేత సామా
న్యుండు గా తా నుండి పోవునొ
అట్టి కర్మల చేత ఆతడు
మనుజ లోకము గెలువ గలుగును''     3.1.36

''యాజ్ఞవల్క్యా! యజ్ఞమునకును
దక్షిణమ్మున బ్రహ్మ కూర్చొని
దేనియాగడములను ద్రోయుచు
యజ్ఞమును రక్షింప గలుగును?''     3.1.37

''అన్ని దిక్కులకింద్రియమ్ముల
వెంట పరుగిడు మనో దేవత
ఆగడమ్ములు తొలగ ద్రోయుచు
యజ్ఞమును రక్షించుచుండును''     3.1.38

''యాజ్ఞవల్క్యా! నేడు జనకుడు
సేయు యజ్ఞము చూచుచుంటివి-
అందులో ఉద్గాత పారము
సేయు స్తోత్రము లేవి చెప్పుము?''     3 1.39

''ఒకటి చూడ 'పురోనువాక్యా'
రెండు 'యాజ్యా' మూడు 'శస్యా'
యజ్ఞమున ఉద్గాత వీటిని
స్తోత్ర పారము సేయుచుండును     3.1.40

ప్రాణమ్మగు పురోనువాక్య
స్తోత్ర,మ్మ పానమగు యాజ్యా
స్తోత్రమ్ము, వ్యానమగు శస్యా
స్తోత్రమ్మధ్యాత్మమున అశ్వల!     3.1.41

ప్రాణమున భూలోక విజయమ్మ
పానమున ఆకాశ విజయము,
వ్యానమున ద్యోలోక విజయము
నొంది యజమానుండు వెలుగును'' 3.1.42

ధీరుడగు ఆ యాజ్ఞవల్క్యుం
డట్లు- అశ్వలుడడుగు ప్రశ్నల
కెల్ల ఉత్తరమిచ్చి తృప్తిని
గూర్చగా నతడూరకుండెను 3.1.43

## 2. యాజ్ఞవల్క్య ఆర్తభాగుల వివాదం

అశ్వలుండటు మిన్నకుండిన
ఆర్త భాగుడు యాజ్ఞ వల్క్యుని
గాంచి ప్రశ్నించెను గ్రహాతి
గ్రహము లేవో చెప్పుమనుచును 3.2.1

''నాసికే ఒక గ్రహము జీవుని
పట్టుకొని తానుండ, గంధము
నాసికేంద్రియ విషయమై బం
ధించు నాతని నతిగ్రహమై 3.2.2

జిహ్వయే ఒక గ్రహము జీవుని
పట్టుకొని తానుండ, రసమది
జిహ్వకింద్రియ విషయమై బం
ధించు నాతని నతిగ్రహమై 3.2.3

చక్షువే ఒక గ్రహము జీవుని
పట్టుకొని తానుండ, రూపము
చక్షురింద్రియ విషయమై బం
ధించునాతని నతిగ్రహమై 3.2.4

చర్మమే ఒక గ్రహము జీవుని
పట్టుకొని తానుండ, స్పర్శము
త్వక్కు కింద్రియ విషయమై బం
ధించునాతని నతిగ్రహమై 3.2.5

శ్రోత్రమే ఒక గ్రహము జీవుని
పట్టుకొని తానుండ, శబ్దము
శ్రోత్రమునకును విషయమై బం
ధించు నాతని నతిగ్రహమై 3.2.6

మానసమ్మొక గ్రహము, జీవుని
పట్టుకొని తానుండ, కోరిక
మాన సేంద్రియ విషయమై బం
ధించునాతని నతిగ్రహమై 3.2.7

చేతులే ఒక గ్రహము, జీవుని
పట్టుకొని తానుండ, కర్మము
వాటికెంతయు విషయమై బం
ధించునాతని నతిగ్రహమై 3.2.8

వాణియే ఒక గ్రహము జీవుని
పట్టుకొని తానుండ, నామము
వాక్కుకింద్రియ విషయమై బం
ధించునాతని నతిగ్రహమై 3.2.9

ఇవియె అష్ట గ్రహములనబడు
అష్టావతిగ్రహములనబడు
వీటిచే బంధింపబడి జీ
వుండు మోక్షము నరయకుండును'' 3.2.10

''లోకమంతయు మృత్యు దేవత
కన్నమని భావించుచుందుము
మృత్యువునకును మృత్యువెవరో
యాజ్ఞవల్క్య చెప్పగలవా?'' 3.2.11

''అగ్ని సర్వమ్మునకు మృత్యువు
కాని దానికి జలము మృత్యువు
మృత్యువునకును మృత్యు వా పర
మాత్మ సాక్షాత్కారమేయగు 3.2.12

బ్రహ్మ సాక్షాత్కారమే బ్ర
హ్మాండమున అమృతత్వ హేతువు
ఈశ్వర ప్రణిధానముననే
మృత్యువును గెలువంగవచ్చును 3.2.13

''యాజ్ఞవల్క్య! ముక్త జీవులు
దేహములు త్యజియించినప్పుడు
వారితో ప్రాణేంద్రియమ్ములు
పోవునని భావింపవలెనా?'' 3.2.14

''ప్రాణములు మరి యింద్రియమ్ములు
ముక్త జీవుల వెంట నంటక
స్వీయమగు కారణములందే
లీనమై ఇట ఉండిపోవును'' 3.2.15

''యాజ్ఞవల్క్య! ముక్తజీవుడు
దేహమును విడనాడి పోయిన
యప్పుడాతని విడువకుండెడి
వస్తువేదో చెప్పగలవా?'' 3.2.16

''ముక్త జీవుని వెంట ఆతని
మంచి పేరే నిలిచియుండును
దానిచే అతడూర్ధ్వ లోకము
లెన్నియో గెలువంగ జాలును'' 3.2.17

''యాజ్ఞవల్క్యా! ఒకటి అడిగెద
చెప్పు– పురుషుడు మరణమొందిన
అగ్నియందున వాణి చేరును
ప్రాణమనిలమునందు జేరును 3.2.18

కన్ను సూర్యుని యందు జేరును
మనసు చంద్రుని యందు, శ్రోత్రము
దిశల, హృదయాకాశమ్ము బ్ర
హ్మాండాకాశమందు జేరును 3.2.19

రక్త వీర్యములప్పులందు, శ
రీరము పృథివియందు, రోమము
లౌషధమ్ములయందు, కేశ
మ్ములు వనస్పతులందు జేరును 3.2.20

పిండమా బ్రహ్మాండమందున
కలిసిపోయిన జీవునికి ఆ
ధారమేమిటి? ఆతడుండునో?
లేక ఉనికిని గోలుపోవునో?'' 3.2.21

ఆర్త భాగుండిట్టులడిగిన
యాజ్ఞవల్క్యుండాతనింగని
కొంత సమయము చర్చజేసియు
చివరికాతని కిట్టులనియెను 3.2.22

''పుణ్యకర్మల చేత పుణ్యము
పాపకర్మల చేత పాపము
సేయువాడే జీవుడగునని
బుద్ధిమంతుడు తెలియ వలయును 3.2.23

అన్నియును త్యజియించిపోయిన
కర్మమాత్రము బద్ధజీవుని
విడిచి పెట్టదు, కర్మ ఆధా
రమ్ముగానే జీవుడుండును 3.2.24

ముక్తజీవుడు మాత్రమే బ్ర
హ్మమున ఆనందించుచుండును
కాని జీవునికున్న సత్తా
కెంత మాత్రము బాధ కలుగదు 3.2.25

## 3. యాజ్ఞవల్క్య భుజ్యుల వివాదం

అంత భుజ్యుడు యాజ్ఞవల్క్యుని
గాంచి యిట్లనె ''స్నేహితులతో
మద్ర దేశములో పతంజలి
యింటికేగితి మొక్క రోజున 3.3.1

అతని బిడ్డను పెండ్లియాడిన
గంధర్వుడు సుధన్వు, డంగిర
గోత్రజుండు, దిగంతములలో
తిరుగ గలిగిన సిద్ధ పురుషుడు 3.3.2

అతనితో- పారిక్షితులు నే
డెక్కడుండిరో చెప్పుమంటిమి-
యాజ్ఞవల్క్యా వారలెక్కడ
ఉందురో మరి చెప్పగలవా?'' 3.3.3

''చెప్పుచుంటిని వినుము, గంధ
ర్వుండు చెప్పిన విషయమిప్పుడు-
రాజవంశపు నామమే పా
రిక్షితుండనునట్టి దరయగ 3.3.4

అశ్వ మేధ క్రతువు సేసెడి
వారు పారిక్షితులు కావున
అశ్వ మేధము సేయు వారలు
పోవుతావున కేగి యుందురు 3.3.5

సూర్యుడెక్కడ ఉదయ మొందునో
తిరిగి యెక్కడ అస్తమించునో
అశ్వ మేధము సేయు వారా
లోకమునకును పోయి యుందురు 3.3.6

అట్టి మార్గము పూర్తి చేయగ
దేవ రథమున కగును ముప్పది
రెండు దినములు దేవ రథ మా
ర్గమ్ము కంటెను పృథ్వి ద్విగుణము 3.3.7

పృథ్వి కంటెను జలధి ద్విగుణము
పృథ్వి జలధుల దాకి యెప్పుడు
గగనముండగ వాటి అంతర
మీగ రెక్కగు, కత్తివాయగు 3.3.8

అట్టి అంతరమందు వాయువు
వీచు చుండును, దాని గుండా
అశ్వ మేధము సేయు వారలు
పోవు చుందురు బ్రహ్మ లోకము 3.3.9

పిండ గతమగు ప్రాణమే బ్ర
హ్మాండగతమగు వాయువనబడు
వ్యష్టి రూప ప్రాణమే బ్ర
హ్మాండ వాయువునందు జేరును 3.3.10

వాస్తవముగా పారిక్షితుల
వ్యష్టి రూప ప్రాణ మేగె స
మష్టిరూపములోని వాయువు
నందు కలియుచు బ్రహ్మలోకము 3.3.11

బ్రహ్మ లోకమ్మనగ శాశ్వత
సుఖ నివాసము, దుఃఖ రహితము
నిరుపమానమ్మాత్మ సాక్షా
త్కార దేశమ్మ మృత రూపము 3.3.12

## 4. యాజ్ఞవల్క్య ఉషస్తచాక్రాయణుల వివాదం

యాజ్ఞవల్క్యుని పలుకులను విని
భుజ్యుడంతట మిన్నకుండిన
అడిగె చాక్రాయణుడు వెంటనె
బ్రహ్మ తత్త్వము తెలియ గోరుచు 3.4.1

''ఏది సాక్షాద్బ్రహ్మమో మరి
యేది ఇంద్రియ గోచరమ్మో
ఏది సర్వవ్యాపకమ్మో
ఏది ఆత్మో దాని చెప్పుము'' 3.4.2

''నీవు పేర్కొను ఆత్మ అందరి
లోన నున్నదె, ఏది ప్రాణము
ద్వారమున తెలియంగ బడునో
అదియె అందరి లోని ఆత్మ'' 3.4.3

''ఏది ఆవో ఏది గుఱ్ఱము
చెప్పుమని ప్రశ్నించునప్పుడు
పాలొసంగున దావటంచును
పరుగు దీయున దశ్వమంచును 3.4.4

చెప్పి నట్లుగ నీవు నందరి
లోన నున్నదె ఆత్మ అంటివి
అంత మాత్రన లాభమేమిటి?
దానినిటు ప్రత్యక్ష పరుచుము'' 3.4.5

''ఆత్మ స్వయముగ జూచు- దానిని
దేనితో చూడంగ నేర్తువు?
ఆత్మ స్వయముగ వినును- దానిని
దేనితో ఆలింప నేర్తువు? 3.4.6

ఆత్మ స్వయముగ తలచు- దానిని
దేనితో మననమ్ము సేతువు?
ఆత్మ స్వయముగ తెలియు- దానిని
దేనితో తెలియంగ నేర్తువు? 3.4.7

ఆత్మ ఎక్కడ ఉన్నదో చూ
పంగ నను నీవడుగుచుంటివి
నేనునందరిలోన నున్నదె
ఆత్మయని చూపించుచుంటిని'' 3.4.8

5. యాజ్ఞవల్క్య కహోలుల వివాదం

అంత చాక్రాయణుడు మౌనము
తోడనుండ కహోలుడప్పుడు
యాజ్ఞవల్క్యుని అడిగె నందరి
లోని ఆత్మను గూర్చి తెలుపగ- 3.5.1

''ఓ కహోలా! వినుము నీలో
ఉన్న ఆత్మయె ఉన్న దందరి
లోన, దానిని నిశ్చయమ్ముగ
బ్రహ్మమని తెలియంగవలయును'' 3.5.2

''క్షుత్పిపాసలు కలత పెట్టగ
శోక మోహము లావహింపగ
జరయు మృత్యువు బాధపెట్టగ
ఎల్లరము బ్రతుకీడ్చువారము 3.5.3

యాజ్ఞవల్క్యా! దుఃఖ హేతువు
లైన ఆకలి, దప్పి మొదలగు
వాటితో సంబంధముండక
వెలుగు ఆత్మను గూర్చి తెలుపుము'' 3.5.4

''ఎట్టి ఆత్మను తెలిసి పండితు
లేషణ త్రయమును త్యజింతురో
అట్టి ఆత్మను గూర్చి అడిగితి
వో కహోలుడ! వినుము చెప్పెద 3.5.5

తృష్ణ మనుజుని సహజ గుణమగు
వయసు పెరిగిన కొలది యయ్యది
మూడు రూపములొందు, దానిని
విడిచి బ్రతుకుట దుష్కరమ్మగు 3.5.6

పుత్రులన్నా విత్తమన్నా
లోకమన్నా తృష్ణ జూపని
వారలుండరు, కాని బ్రహ్మ
జ్ఞాని వాటిని విడువ జాలును 3.5.7

మరియు నాతడు స్వీయమగు పాం
డిత్యమును విడనాడి బాలకు
డగును, పిమ్మట బాలభావము
విడిచి పెట్టుచు ముని వరుండగు 3.5.8

పిదప మౌనము వీడి బ్రహ్మ
జ్ఞానియై వెలుగొందుచుండును
బ్రహ్మ తత్త్వము నెరుగ గోరిన
జ్ఞాన మార్గమె శ్రేష్ఠమైనది 3.5.9

ఆత్మనెరుగుటకెట్టులైనా
శుద్ధ బ్రహ్మ జ్ఞాని గావలె
జ్ఞాన మార్గము కంటె భిన్నం
బేదియైనా దుఃఖకరమే'' 3.5.10

## 6. యాజ్ఞవల్క్య – గార్గి వివాదం

అటు కహోలుండాదరమ్మున
తగు సమాధానమ్ము నొందగ,
యాజ్ఞవల్క్యుని తోడ జనకుని
కొలువులో గల గార్గి యిట్లనె 3.6.1

''నాల్గు దిక్కుల నీటితో భూ
లోకమోత ప్రోతమైనది
కాని ఆ జలమెందు నోత
ప్రోతమైనదొ చెప్ప గలవా?'' 3.6.2

''జలము వాయువునందు నోత
ప్రోతమైనది'' ''వాయువెందున?''
''వాయువనునది అంతరిక్షము
నందునోతప్రోతమైనది'' 3.6.3

''అంతరిక్షమ్మెందు నోత
ప్రోతమైనది తెలుపు'' ''మది గం
ధర్వ లోకములందు నోత
ప్రోతమైనది'' అవియునెందున?'' 3.6.4

''సూర్యలోకములందు నోత
ప్రోతమైనవి'' ''సూర్యలోకము
లెందు నోతప్రోతమైనవి?''
''చంద్ర లోకములందు తెలియుము'' 3.6.5

''చంద్రలోకములెందు నోత
ప్రోతమైనవి?'' ''తారకాలో
కమ్ములందున'' ''అవియునెందున?''
దేవ లోకములందు తెలియుము'' 3.6.6

''దేవలోకములెందు నోత
ప్రోతమైనవి?'' ''ఇంద్రలోకము
లందు నోతప్రోతమైనవి''
''ఇంద్ర లోకములెందు తెలుపుము?'' 3.6.7

''ప్రజాపతి లోకమ్ములందున''
''వస్త్రమున దారమ్ములట్టుల
సూత్రమున మణులట్టులవ్వియు
నెందునోతప్రోతమైనవి?'' 3.6.8

''బ్రహ్మలోకమునందు'' ''మరి ఆ
బ్రహ్మలోకమ్మెందు తెలుపుము''
''గార్గి! అతిగా ప్రశ్న వేయకు
శిరసు పడిపోగలదు సుమ్మీ'' 3.6.9

సర్వ లోకాధారమగు బ్ర
హ్మమ్ము మించినదేది గానము
దేనియందున బ్రహ్మముందని
అడుగుటే అతిప్రశ్న అనబడు 3.6.10

## 7. యాజ్ఞవల్క్య ఉద్దాలకుల వివాదం

అంత ఉద్దాలకుడనంబడు
నతడు పలికెను యాజ్ఞవల్క్యుని
తోడ ''మిత్రులతో పతంజలి
ఇంటి కరిగితి మొక్క రోజున 3.7.1

యజ్ఞశాస్త్రము నభ్యసించెడి
కోర్కెతో మేమతని గృహమున
నిలిచి యుండ కబంధుడనియెడి
వాడు మమ్ముల జూచి యడిగెను 3.7.2

''సూత్రమందున మణుల కైవడి
దేనియందున నిహపరమ్ములు
సర్వభూతము లంచితమ్ముగ
గ్రుచ్చ బడెనో చెప్పగలరా? 3.7.3

సర్వ భూతమ్ములకు లోపల
ఉండి వాటిని యెల్లవేళల
ఎవడు నియమింపంగ జాలునొ
అట్టి అంతర్యామి తెలుసా ? 3.7.4

సూత్రమెవ్వడు దెలియు, నంత
ర్యామినెవ్వడు దెలియునాతడు
బ్రహ్మ విదుడగు, లోక విదుడగు
నాత్మ విదుడగు సర్వ విదుడగు'' 3.7.5

అనుచు పలికెడినతనితోడను
సూత్ర విషయము గూర్చి, యంత
ర్యామి విషయము గూర్చి కొండొక
సేపు చర్చలు చేసినారము 3.7.6

కాని, నీకా సూత్ర విషయము
మరియు నంతర్యామి విషయము
తెలిసెనేని వచింపుమిప్పుడు
లేనిచో శిరసూడి పోవును" 3.7.7

అనుచునుద్దాలకుడు పలుకగ
యాజ్ఞవల్క్యుండనెను "గౌతమ!
సూత్ర విషయము మరియు నంత
ర్యామి విషయము నాకు తెలియును" 3.7.8

"నేనెరుంగుదు నేనెరుంగుదు
ననుచు నెల్లరు పలుకు వారే
యాజ్ఞవల్క్యా! నీవెరింగిన
దాని నాకెరిగింపవయ్యా!" 3.7.9

"గౌతమా! బ్రహ్మాండమున నెల
కొన్న వాయువు, పిండమందలి
ప్రాణమే నీవడుగుచుండిన
సూత్రమని తెలియంగవలయును 3.7.10

మణులు దారమునందు నే గతి
గ్రుచ్చబడునో, ఇహ పరమ్ములు
సర్వభూతము లా విధమ్ముగ
గ్రుచ్చబడునా సూత్రమందున 3.7.11

చచ్చిపోయిన మనిషి అంగము
లెల్లశిథిలములైన వందురు
ప్రాణవాయు సూత్రమువనే
జీవితుని అంగమ్ములుండును'' 3.7.12

సూత్ర విషయము గూర్చి నీవు వ
చించినట్టిది సత్యమేయగు
యాజ్ఞవల్క్యా! ఇంక అంత
ర్యామి తత్త్వము చెప్పవయ్యా! 3.7.13

''భూమి యందున నిలిచియుండియు
భూమి కంటెను భిన్నుడగుచును
భూమిచే తెలియంగ జాలక
భూమినే దేహమ్ము గాగా 3.7.14

భూమి లోపల ఉండియెవ్వడు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదు నన్న బ్రహ్మము 3.7.15

నీటియందున నిలిచియుండియు
నీటి కంటెను భిన్నుడగుచును
నీటిచే తెలియంగ జాలక
నీటినే దేహమ్ము గాగా 3.7.16

నీటి లోపల ఉండి యెవ్వడు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.17

అగ్నియందున నిలిచి యుండియు
అగ్ని కంటెను భిన్నుడగుచును
అగ్నిచే తెలియంగ జాలక
అగ్నినే దేహమ్ము గాగా 3.7.18

అగ్ని లోపల ఉండియెవ్వడు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదు నన్న బ్రహ్మము 3.7.19

అంతరిక్షమునందు నిలిచియు
అంతరిక్షము కంటె వేరై
అంతరిక్షము చేత తెలియక
అంతరిక్షము తనువు గాగా 3.7.20

అంతరిక్షము లోపలుండియు
సర్వమును నియమించునెవ్వడు?
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదు నన్న బ్రహ్మము 3.7.21

గాలి యందున నిలిచి యుండియు
గాలి కంటెను భిన్నుడగుచును
గాలిచే నెరుగంగ జాలక
గాలినే దేహమ్ము గాగా 3.7.22

గాలి లోపల ఉండియెవ్వడు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.23

దివమునందున నిలిచియుండియు
దివము కంటెను భిన్నుడగుచును
దివముచే నెరుగంగ జాలక
దివమునే దేహమ్ము గాగా 3.7.24

దివము లోపల ఉండియెవ్వడు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుండుదునన్న బ్రహ్మము 3.7.25

ఎవడు సూర్యుని యందు నిలిచియు
ఎవడు సూర్యుని కంటె వేరై
ఎవడు సూర్యుని చేత తెలియక
సూర్యుడే దేహమ్ము గాగా 3.7.26

ఎవడు సూర్యుని లోపలుండియు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.27

ఎవడు దిక్కుల యందు నిలిచియు
ఎవడు దిక్కుల కంటె వేరై
ఎవడు దిక్కుల చేత తెలియక
దిక్కులే దేహమ్ము గాగా 3.7.28

ఎవడు దిక్కుల లోపలుండియు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.29

ఎవడు చంద్రుని యందు నిలిచియు
ఎవడు చంద్రుని కంటె వేరై
ఎవడు చంద్రుని చేత తెలియక
చంద్రుడే దేహమ్ము గాగా 3.7.30

ఎవడు చంద్రుని లోపలుండియు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.31

ఎవడు చుక్కల యందు నిలిచియు
ఎవడు చుక్కల కంటె వేరై
ఎవడు చుక్కల చేత తెలియక
చుక్కలే దేహమ్ము గాగా 3.7.32

ఎవడు చుక్కల లోపలుండియు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.33

నింగి యందున నిలిచియుండియు
నింగి కంటెను భిన్నుడగుచును
నింగిచే తెలియంగ జాలక
నింగినే దేహమ్ము గాగా 3.7.34

నింగి లోపల ఉండి యెవ్వడు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.35

అంధకారము నందు నిలిచియు
అంధకారము కంటె వేరై
అంధకారము చేత తెలియక
అంధకారము తనువు గాగ 3.7.36

అంధకారము లోపలుండియు
సర్వమును నియమించునెవ్వడు
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.37

వెలుగునందున నిలిచియుండియు
వెలుగు కంటెను భిన్నుడగుచును
వెలుగుచే తెలియంగ జాలక
వెలుగునే దేహమ్ము గాగా 3.7.38

వెలుగు లోపల ఉండి యెవ్వడు
సర్వమును నియమించుచుండునొ
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదు నన్న బ్రహ్మము 3.7.39

ఎవడు ప్రాణుల యందు నిలిచియు
ఎవడు ప్రాణుల కంటె వేరై
ఎవడు ప్రాణుల చేత తెలియక
ప్రాణులే దేహమ్ము గాగా 3.7.40

ఎవడు ప్రాణుల లోపలుండియు
సర్వమును నియమించుచుండునొ
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.41

ఎవడు ప్రాణమునందు నిలిచియు
ఎవడు ప్రాణము కంటె వేరై
ఎవడు ప్రాణము చేత తెలియక
ప్రాణమే దేహమ్ము గాగా 3.7.42

ఎవడు ప్రాణము లోపలుండియు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదు నన్న బ్రహ్మము 3.7.43

ఎవడు నేత్రమునందు నిలిచియు
ఎవడు నేత్రము కంటె వేరై
ఎవడు నేత్రము చేత తెలియక
నేత్రమే దేహమ్ము గాగా 3.7.44

ఎవడు నేత్రము లోపలుండియు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగు దునన్న బ్రహ్మము 3.7.45

వాణి యందున నిలిచి యుండియు
వాణి కంటెను భిన్నుడగుచును
వాణిచే తెలియంగ జాలక
వాణినే దేహమ్ము గాగా 3.7.46

వాణి లోపల ఉండి యెవ్వడు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.47

ఎవడు శ్రోత్రమునందు నిలిచియు
ఎవడు శ్రోత్రము కంటె వేరై
ఎవడు శ్రోత్రము చేత తెలియక
శ్రోత్రమే దేహమ్ము గాగా 3.7.48

ఎవడు శ్రోత్రము లోపలుండియు
సర్వమును నియమించుచుండునొ
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.49

మనసు నందున నిలిచియుండియు
మనసు కంటెను భిన్నుడగుచును
మనసుచే తెలియంగ జాలక
మనసునే దేహమ్ము గాగా 3.7.50

మనసు లోపల ఉండి యెవ్వడు
సర్వమును నియమించుచుండునొ
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.51

త్వక్కునందున నిలిచియుండియు
త్వక్కుకంటెను భిన్నుడగుచును
త్వక్కుచే తెలియంగ జాలక
త్వక్కునే దేహమ్ము గాగా 3.7.52

త్వక్కు లోపల ఉండి యెవ్వడు
సర్వమును నియమించుచుండునొ
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.53

ఎవడు జ్ఞానము నందు నిలిచియు
ఎవడు జ్ఞానము కంటె వేరై
ఎవడు జ్ఞానము చేత తెలియక
జ్ఞానమే దేహమ్ము గాగా 3.7.54

ఎవడు జ్ఞానము లోపలుండియు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.55

ఎవడు రేతసు నందు నిలిచియు
ఎవడు రేతసు కంటె వేరై
ఎవడు రేతసు చేత తెలియక
రేతసే దేహమ్ము గాగా 3.7.56

ఎవడు రేతసు లోపలుండియు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.57

ఎవడు సర్వమునందు నిలిచియు
ఎవడు సర్వము కంటె వేరై
ఎవడు సర్వము చేత తెలియక
సర్వమే దేహమ్ము గాగా 3.7.58

ఎవడు సర్వము లోపలుండియు
సర్వమును నియమించుచుండునో
ఆతడంతర్యామి, అమృతము
నేనెరుంగుదునన్న బ్రహ్మము 3.7.59

ద్రష్ట- అంతర్యామి బ్రహ్మము
కనులు వానిని చూడ జాలవు
శ్రోత – అంతర్యామి బ్రహ్మము
చెవులు వానిని వినగ జాలవు 3.7.60

మంత – అంతర్యామి బ్రహ్మము
మనసు వానిని తెలియ జాలదు
జ్ఞాత – అంతర్యామి బ్రహ్మము
తెలివి వానిని కొలువజాలదు 3.7.61

అతని మించిన మేటి ద్రష్ట
శ్రోతమంత జ్ఞాతలుండరు
ఆతడంతర్యామి – అమృతము
నేనెరుంగుచునన్న బ్రహ్మము" 3.7.62

## 8. యాజ్ఞవల్క్యునితో గార్గి రెండవసారి వివాదం

అంత ఉద్దాలకుడు మౌనము
పూని యుండగ గార్గి నిలబడి
పండితుల యనుమతిని పొందెను
యాజ్ఞవల్క్యుని తిరిగి యడుగగ 3.8.1

యాజ్ఞవల్క్యుడు – తాను వేసెడి
రెండు ప్రశ్నలకుత్తరమ్ము లొ
సంగె నేనియు, నతనినెవ్వరు
గెలువరనుచును గార్గి పలికెను 3.8.2

''యాజ్ఞవల్క్యా! కాశి వాసియొ
లేని యెడల విదేహ వాసియొ
వీరుడొక్కడు ధనువు గైకొని
వాడి మొనగల బాణములతో 3.8.3

శత్రువులనెదిరించినట్లుగ
రెండు ప్రశ్నలతోడ నిన్నెది
రించగా నీ ముందు నిలిచితి''
ననగ నాతండడుగుమనియెను 3.8.4

''మూడు కాలములెందు నోత
ప్రోతమైనవి? దివము పైనా
భూమి క్రిందా అంతరిక్షము
లోన నుండునదేది చెప్పుము?'' 3.8.5

''దివము పైనా భూమి క్రిందా
అంతరిక్షములోన నుండున
దాకాశమే, మూడు కాలము
లందు నోతప్రోతమైనవి'' 3.8.6

''యాజ్ఞవల్క్యా! నీకుదండం
బిడుదు, రెండవ ప్రశ్న నడుగుదు
దేని యందున నట్టి ఈ ఆ
కాశమోతప్రోతమైనది?'' 3.8.7

''గార్గి! ఈ ఆకాశమోత
ప్రోతమై యున్నట్టి దానిని
బ్రహ్మమెరిగిన వారు నిత్యము
అక్షరమ్మని పలుకుచుందురు 3.8.8

అది వినాశము లేని తత్త్వము
కాదు స్థూలము - కాదు సూక్ష్మము
కాదు దీర్ఘము - కాదు హ్రస్వము
నిప్పు వలె అది కాదు ఎఱుపూ 3.8.9

కాదు స్నిగ్ధము నేయి వొలెను
కాదు ఛాయయు – కాదు చీకటి
కాదు వాయువు – కాదు గగనము
కాదు సంగము – కాదు రసమూ 3.8.10

కాదు గంధము – కాదు రూపము
కాదు శ్రోత్రము – కాదు వాక్కూ
కాదు చిత్తము – కాదు తేజము
కాదు ప్రాణము – కాదు వదనము 3.8.11

లేదు పరిమాణమ్ము దానికి
లేవు బాహ్యాంతరము లేమియు
అది భుజించదు, తినరు దానిని
అది వినాశము లేని తత్త్వము 3.8.12

గార్గి! అక్షరు శాసనము న గ
లుగు నిమేష ముహూర్తములు, దిన
రాత్రములు, పక్షములు, ఋతువులు
మాసములు, సంవత్సరమ్ములు 3.8.13

గార్గి! అక్షరు శాసనమ్మున
మంచు కొండల నుండి వెల్వడి
నదులు సాగును తూర్పు పడమర
లనగ నేమిటి? అన్ని దిశలకు– 3.8.14

గార్గి! అక్షరు శాసనమ్మున
దాతలను కీర్తించుచుందురు
మానవులు, మరి దేవతలు యజ
మానులను కీర్తించుచుందురు– 3 8.15

గరిటెలను చేబట్టి పితరులు
మానవుల సేవింతురో యన
మంత్రములతో అగ్నిహోత్రము
లందు ఆహూతులొసగుచుందురు 3.8.16

అక్షర బ్రహ్మమ్ము నెరుగక
యజ్ఞములు హోమములు చేసిన
పెద్ద కాలము తపము జేసిన
నవియు నన్నియు వ్యర్థమేయగు 3.8.17

గార్గి! అక్షరు దెలియనేరక
లోకమును విడనాడు కృపణుడు,
కాని అక్షరు దెలిసి లోకము
విడుచువాడే బ్రాహ్మణుండగు 3.8.18

అక్షరము స్వయముగ అదృష్టము
కాని సర్వము చూడగల్గును
అక్షరము స్వయముగ అశ్రుతము
కాని సర్వమును వినగల్గును 3.8.19

అక్షరము స్వయముగా అమతము
కాని మననము చేయగల్గును
కాదు స్వయముగా విజ్ఞాతము
కాని సర్వము దెలియగల్గును 3.8 20

అక్షరమునకు సాటి రాగల
ద్రష్టయేనియు, శ్రోతయేనియు
మంతయేనియు, జ్ఞాతయేనియు
గార్గి! లేరని తెలియవమ్మా! 3.8.21

ఇట్టి అక్షర తత్త్వమందే
నీవు నను ప్రశ్నించు ఆకా
శమ్ము - ఓతప్రోతమైనది
గార్గి! ఇంతయు తెలియవమ్మా!'' 3.8.22

యాజ్ఞవల్క్యుని పలుకులను విని
ముదము నొందిన గార్గి యిట్లనె
''పూజ్యులగు విద్వాంసులారా!
యాజ్ఞవల్క్యుడు బ్రహ్మవేత్తయె 3.8.23

ఈ మహర్షి వచించినట్టిది
గొప్పగా భావించి, అంజలి
గూర్చి ముక్తులు కండు- ఆతని
గెలువజాలరు మీరలెవ్వరు'' 3.8.24

## 9. యాజ్ఞవల్క్య విదగ్ధుల సంవాదం

గార్గి ప్రశ్నలు వేసి కూర్చొని
యున్న యంతట యాజ్ఞవల్క్యుని
గూర్చియెవ్వరు నడుగకున్న వి
దగ్ధుడనువాడడిగె నిట్టుల- 3.9.1

''యాజ్ఞవల్క్యా! చెప్పు దేవత
లెందరో మరి?'' ''మూడు వేలును
మూడు వందల ఆరు దేవత
లనుచు మంత్రము చెప్పుచున్నది'' 3.9.2

''అదియు సరియే చెప్పు దేవత
లిన్నియో మరి?'' ''ఆరు దేవత''
''లది సరే మరి ఎన్ని దేవత?''
''లవ్వి మూడగు'' ''నది సరే మరి 3.9.3

దేవతలెన్నిసెప్పుము?'' ''రెండు''
''దేవతలెన్ని?'' ''ఒకటిన్నరగు''
''నది సరే మరి యెన్ని దేవత?''
''లొక్కటే మనకున్న దేవత'' 3.9 4

''అది సరే మరి, యాజ్ఞవల్క్య!
మొదట చెప్పిన మూడు వేలును
మూడు వందల ఆరు దేవత
లేమిటో వివరింపగలవా?'' 3 9.5

''దేవతల మహిమమ్ము చెప్పగ
మూడు వేలును, మూడు వందల
ఆరు దేవతలంటి నింతయె
అసలు ముప్పది మూడు మాత్రమె'' 3.9.6

''వివరమొప్పగ చెప్పు ముప్పది
మూడు దేవతలెవ్వియో మరి?
సంఖ్యా విషయమందు మా సం
దేహములు త్యజియింతుమింకను'' 3.9.7

''వసువులెనిమిది, రుద్రులును పద
కొండు, ఆదిత్యులును పన్నెం,
డింద్రుడొకడు, ప్రజాపతి యొకడు
కలసి ముప్పది మూడు మాత్రమె 3.9.8

భూమి, నీరూ, నిప్పు, గాలీ
నింగియును మరి సూర్య చంద్రులు
చుక్కలెనిమిది సృష్టివాస
స్థానములు కాబట్టి వసువులు 3.9.9

ఆత్మతో పది ప్రాణములు దే
హమును వీడుచు పోవునప్పుడు
దుఃఖమును కలిగించు కావున
రుద్రులని వచియింత్రు వాటిని 3.9.10

ప్రాణమనగ, అపానమనగా
వ్యానమనగ, ఉదానమనగా,
మరి సమానమనగ మహా ప్రా
ణమ్ములైదు వెలుంగుచుండును 3.9 11

నాగమనగా, కూర్మమనగా
కృకలమనగా, దేవదత్తం
బనగ, మరియు ధనంజయమనగ
ఐదుప ప్రాణమ్ములలరును 3.9 12

వత్సరమ్మున నుండు ద్వాదశ
మాసములె ఆదిత్యులనబడు
వస్తు సంతతి యొక్క ఆయువు
గొనుటచే నాపేరు గలిగెను 3.9.13

ఇంద్రుడన విద్యుత్తు, వర్షము
నొసగి అన్నము నుద్భవింపగ
చేసినందున లోకమున సం
వృద్ధి యగు నైశ్వర్యమెప్పుడు 3.9.14

ఇక ప్రజాపతి యెవ్వరనగా
యజ్ఞమే, పశు జీవనమ్మున
సాగి అది సంపూర్ణ జగమున
నడుచుచుండును నిశ్చయమ్ముగ 3.9.15

మొదట చెప్పిన ఆరు దేవత
లెవ్వియనగా అగ్ని, సూర్యం,
డంతరిక్షము, పృధివి, వాయువు,
దివము, వీనింగలియు విశ్వము 3.9.16

మూడు దేవతలెవ్వి యనగా
పృధివి, దివమూ, అంతరిక్షము
వీనిలోనే అగ్ని సూర్యులు
వాయువంతర్భూతములగును 3.9.17

రెండు దేవత లెవ్వియనగా
ప్రాణదేవత, అన్న దేవత
ఒకటి జీవన సూచకమ్మగు
ఒకటి ప్రకృతికి సూచకమ్మగు 3.9.18

ఒకటి మరి సగ మేదియనగా
పిండగతమగు ప్రాణమే, ప్రా
ణంబొకటి ఒకటిన్నరెట్లగు
ననగ నిరతము వృద్ధిగొనుటే'' 3.9.19

''యాజ్ఞవల్క్యా! దేవతొక్కటి
యనుచు లెస్సగ బల్కుచుంటివి
ఏమిటో అది చెప్పగలవా?''
''అదియు ప్రాణంబదియునొకటే'' 3.9.20

''బ్రహ్మ వేత్తల లోన శ్రేష్ఠుడ
ననుచు నీవు దలంచుచుంటివి
బ్రహ్మమనియెడి వాడెవండో
యాజ్ఞవల్క్యా! నీకు తెలుసా? 3.9.21

ప్రాణికోటి పరాయణుండై
మనసు జ్యోతిగ, అగ్ని తోడుగ
పృథివిలో నివసించు పురుషుని
తెలియువాడే బ్రహ్మవేత్తగు'' 3.9.22

''నీవు పేర్కొనునట్టి పురుషుడు
నిజముగా శారీర పురుషుడు
అంతకంటెను మించు బ్రహ్మ
మ్మడుగవయ్య విదగ్ధ! యింకను'' 3.9.23

''నేను పేర్కొనునట్టి పురుషుడు
స్వయముగా బ్రహ్మమ్ము కాదని
పలుకుచుంటివి కాని అతనికి
దేవుడెవరో చెప్పగలవా?'' 3.9.24

''అతని దేవుండమృతుండగు
దేవతల కధి నాయకుండగు
మృత్యు ధర్మము గలది విశ్వము
మృత్యువంటని వాడు దేవుడు'' 3.9.25

''ప్రాణికోటి పరాయణుండై
మనసు జ్యోతిగ, హృదయమిల్లుగ
కామన స్థితి గలుగు పురుషుని
తెలియువాడే బ్రహ్మవేత్తగు'' 3.9.26

''నీవు పేర్కొనునట్టి పురుషుడు
కామమయుడని తెలియుచున్నది
అంతకంటెను మించు బ్రహ్మ
మ్మడుగవయ్య విదగ్ధ! యింకను'' 3.9.27

''ప్రాణికోటి పరాయణుండై
మనసు జ్యోతిగ, నేత్రమిల్లుగ
రూపమున నిలుచున్న పురుషుని
తెలియువాడే బ్రహ్మవేత్తగు'' 3.9.28

''నీవు పేర్కొనునట్టి వాడా
దిత్య పురుషుండని యెరుంగుము
కాని అంతకు మించు బ్రహ్మము
నడుగవయ్య విదగ్ధ! యింకను'' 3.9.29

''నేను పేర్కొనునట్టి పురుషుడు
స్వయముగా బ్రహ్మమ్ము కాడని
పలుకుచుంటివి కాని అతనికి
దేవుడెవరో చెప్పగలవా?'' 3.9.30

''వస్తు సంతతి సత్య రూపము
చూప గలడాదిత్య పురుషుడు
కాని ఆదిత్యునకు దేవుడు
సత్యస్వరూపుడగు బ్రహ్మము'' 3 9.31

''ప్రాణికోటి పరాయణుండై
మనసు జ్యోతిగ, శ్రోత్రమిల్లుగ
గగనమున నిలుచున్న పురుషుని
తెలియు వాడే బ్రహ్మ వేత్తగు'' 3.9.32

''నీవు పేర్కొనుచున్న పురుషుని
శ్రోత్ర పురుషుని గానెరుంగుదు
నంతకంటెను మించు బ్రహ్మము
నడుగవయ్య విదగ్ధ! యింకను'' 3.9 33

''నేను పేర్కొనునట్టి పురుషుడు
స్వయముగా బ్రహ్మమ్ము కాడని
పలుకుచుంటివి కాని అతనికి
దేవతెవరో చెప్పగలవా? 3.9.34

అతని దేవతయగును దిక్కులు
దిక్కులే కద శ్రోత్రమును, ఆ
కాశమును, శబ్దమును తమలో
చక్కగా నిమిడించుకొన్నవి!'' 3.9.35

''ప్రాణికోటి పరాయణుండై
మనసు జ్యోతిగ, హృదయమిల్లుగ
తమములో వెలుగొందు పురుషుని
తెలియువాడే బ్రహ్మవేత్తగు'' 3.9.36

''నీవు పేర్కొనునట్టి పురుషుని
నేను ఛాయా పురుషుడందును-
అంతకంటెను మించు బ్రహ్మము
నడుగవయ్య విదగ్ధ! యింకను'' 3 9.37

''నేను పేర్కొనునట్టి పురుషుడు
స్వయముగా బ్రహ్మమ్ము కాడని
పలుకుచుంటివి కాని అతనికి
దేవతెవరో చెప్పవయ్యా! 3.9 38

''అతని దేవత యగును మృత్యువు
మృత్యువనగా అంధకారము
దేవదేవుని మృత్యురూపమె
లోకమున వ్యాపించి ఉన్నది'' 3.9 39

''ప్రాణికోటి పరాయణుండై
మనసు జ్యోతిగ, చక్షువిల్లుగ
పిండమై వెలుగొందు పురుషుని
తెలియువాడే బ్రహ్మవేత్తగు'' 3 9.40

''నీవు చెప్పెడి పురుషు నద్దము
లోని బొమ్మగ నే దలంతును
అంతకంటెను మించు బ్రహ్మము
నడుగవయ్య విదగ్ధ! యింకను'' 3.9.41

''నేను పేర్కొనునట్టి పురుషుడు
స్వయముగా బ్రహ్మమ్ము కాడని
చెప్పుచుంటివి కాని అతనికి
దేవతెవరో చెప్పవయ్యా!'' 3.9.42

''ప్రాణమనునది నీవు పేర్కొను
నట్టి పురుషునికగును దేవత
దేహ గతమగు ప్రాణమే పిం
డమును రక్షణ సేయుచున్నది'' 3.9.43

''ప్రాణికోటి పరాయణుండై
మనసు జ్యోతిగ హృదయమిల్లుగ
జలములందు వెలుంగు పురుషుని
తెలియువాడే బ్రహ్మవేత్తగు'' 3.9.44

''నీవు పేర్కొనునట్టి పురుషుని
జల పురుషునిగ నేనెరుంగుదు
కాని అంతకు మించు బ్రహ్మము
నడుగవయ్య విదగ్ధ! యింకను'' 3.9.45

''నేను పేర్కొనునట్టి పురుషుడు
స్వయముగా బ్రహ్మమ్ము కాడని
పలుకుచుంటివి కాని అతనికి
దేవతెవరో చెప్పవయ్యా!'' 3.9 46

''ఆతనికి వరుణుండు దేవత
సకల జలదేవతల దేవత
అతనికంటెను మించు బ్రహ్మము,
బ్రహ్మమున కతడగును దేహము'' 3.9.47

''ప్రాణికోటి పరాయణుండై
మనసు జ్యోతిగ, హృదయమిల్లుగ
రేతసున వెలుగొందు పురుషుని
తెలియువాడే బ్రహ్మవేత్తగు 3.9.48

''నీవు పేర్కొనునట్టి పురుషుడు
పుత్రమయుడని నేదలంతును
కాని అంతకు మించు బ్రహ్మము
నడుగవయ్యా విదగ్ధ! యింకను'' 3.9.49

''నేను పేర్కొనునట్టి పురుషుడు
స్వయముగా బ్రహ్మమ్ము కాడని
పలుకుచుంటివి కాని అతనికి
దేవతెవరో చెప్పవయ్యా!'' 3.9 50

''ప్రజాపతి ఆతనికి దేవత,
దేవ దేవుని ఆ ప్రజాపతి
రూపమే ఈ చరాచరమగు
సృష్టి జేయుచు వెలుగుచున్నది 3.9.51

బ్రాహ్మణులు నిర్వారిపోయెడి
అగ్నికణముగ చేయజూచెద
రింక అడుగుట మానవయ్యా!
లేనిచో బొగ్గగుదువయ్యా!'' 3.9.52

యాజ్ఞవల్క్యుని హాస్య వచనము
లెక్క సేయక ఆ విదగ్ధుడు-
పాంచాలకురు బ్రాహ్మణులను
గెలిచినట్టుల కాదు లెమ్మనె 3.9.53

''నీకు బ్రహ్మమ్మెట్లు తెలియును?
దిక్కులైనను తెలియునా? ఆ
దిక్కులేవో తెలిపి వాని ప్ర
తిష్ఠయెక్కడొ చెప్పగలవా? 3.9.54

పూర్వదిశ గల దేవతెవ్వరు?''
''సూర్యదేవత'' ''దేనియందు ప్ర
తిష్ఠితుండగు?'' ''నేత్రమందున''
''నేత్రమెందున?'' ''రూపమందున'' 3.9.55

''రూపమెందు ప్రతిష్ఠితమ్మగు''
''హృదయమందున, హృదయమే లే
కున్న రూపము, చక్షువే లే
కున్న సూర్యుండుండి వ్యర్థము 3.9.56

మనసు, రూపము; కన్ను, సూర్యుడు;
మిగుల పరస్పరాశ్రితమ్ములు
లోకమున రూపాదులన్నిటి
కంతిమ స్థానమ్ము హృదయము'' 3.9.57

''దక్షిణమ్మున దేవతెవ్వరు?''
''యముడనంబడు మృత్యుదేవత''
''మృత్యువెందు ప్రతిష్ఠితమ్మగు?
''యజ్ఞమందు ప్రతిష్ఠితంబగు'' 3.9.58

''యజ్ఞమెందు ప్రతిష్ఠితమ్మగు''
''దానగుణమున'' ''దానమెందున?''
''శ్రద్ధయందున'' ''శ్రద్ధయెందున?''
''హృదయమందు ప్రతిష్ఠితమ్మగు'' 3.9.59

''శ్రద్ధయనునది హృదయమందే
సుప్రతిష్ఠితమగుచునొప్పును
లోకమందు యమాదులన్నిటి
కంతిమ స్థానమ్ము హృదయము'' 3.9.60

''పశ్చిమమ్మున దేవతెవ్వరు?''
''మేఘమనబడు వరుణ దేవత''
''వరుణుండెందు ప్రతిష్ఠితుండగు?''
''జలమునందు ప్రతిష్ఠితుండగు'' 3.9.61

''జలములెందు ప్రతిష్ఠితమ్మగు?''
''మన రజో వీర్యమ్ములందున''
''ఆ రజోవీర్యమ్ములెందున?''
''హృదయమందు ప్రతిష్ఠితమ్మగు'' 3.9.62

''ఉత్తరమ్మున దేవతెవ్వరు?''
''బ్రహ్మచారి యనబడు సోముడు''
''సోముడెందు ప్రతిష్ఠితుండగు?''
''దీక్షయందు ప్రతిష్ఠితుండగు'' 3.9.63

''దీక్షయెందు ప్రతిష్ఠితమ్మగు?''
''సత్యమందున, బ్రహ్మచారికి
సత్యదీక్ష నొసంగి ఆచా
ర్యుండు సత్యము చెప్పగోరును'' 3.9.64

''సత్యమెందు ప్రతిష్ఠితమ్మగు?''
''హృదయమందు ప్రతిష్ఠితమ్మగు,
లోకమందు సత్యా హింసల
కంతిమ స్థానమ్ము హృదయము'' 3 9.65

''ధ్రువాదిక్కునకెవరు దేవత?''
''అగ్ని'' ''యెందు ప్రతిష్ఠితంగు ?''
''వాక్కునందు, శరీరమున జ్ఞా
నమును వెలిగించునది వాణియె'' 3 9.66

''వాణియెందు ప్రతిష్ఠితమ్మగు?''
''హృదయమందు ప్రతిష్ఠితంబగు''
''హృదయమందే అన్ని కలవని
పలుకుదువు మరి హృదయమెక్కడ?'' 3.9.67

''మూర్ఖుడా! దేహమ్ము లోపల
హృదయముందని కూడ తెలియద?
హృదయమింకొక చోట మసలిన
దేహమే గతి నిలువగలుగును? 3.9.68

హృదయమే లేకున్న తనువును
చీల్చి కుక్కలు తినక యుండున?

యాజ్ఞవల్క్యుని వచనములు విని
ఆ విదగ్ధుడు మరల యిట్లనె-
''నీ శరీరము నీదు హృదయము
కలిసికొనుచోటేది చెప్పుము!'' 3.9.70

''ప్రాణమే ఆ చోటు'' ప్రాణం
బున్నదేడ?'' ''అపానమందు'' ''అ
పానమెక్కడ?'' ''వ్యానమందున''
''వ్యానమేడ?'' ''ఉదానమందు'' ఉ
దానమేడ?'' ''సమానమందున'' 3.9.71

ఓ విదగ్ధా! ఆత్మనింతకు
మిక్కిలిగ వర్ణింపజాలము
కాని అధికముగా వచించిన
కాదు కాదని చెప్పగానగు 3.9.72

ఆత్మ దెలియగ నలవి గానిది
అది అశీర్యంబది అసంగము
అది అసక్తము బంధరహితము
అది వినాశము లేని తత్త్వము 3.9.73

''ఓ విదగ్ధా! ఇంతదాకా
అష్టదేవతలష్ట పురుషుల
గూార్చి మాత్రమె చర్చ జరిగెను
కాని వాటికి పెద్ద బ్రహ్మము 3.9.74

పూర్వవర్ణిత విరాట్ పురుషుని
భిన్నభిన్న స్వరూపములకు
మించి ఉపనిషద్పురుషుడుండి
ఉపనిషత్తుల వలన దెలియును 3.9.75

ఓ విదగ్ధా! అట్టి పురుషుని
గూర్చి వర్ణన సేయువయ్యా!
కానిచో తలవంచుకోగల
స్థితిని పొందక తప్పదయ్యా!'' 3.9.76

యాజ్ఞవల్క్యుని ప్రశ్నకుత్తర
మీయజాలక శకల పుత్రుడు
సిగ్గుచే తల నేలవ్రాలగ
నిలువ లేకను సభను వీడెను. 3.9.77

యాజ్ఞవల్క్యుండపుడు సభలో
నున్న వారిని గాంచి- ''బ్రహ్మము
గూర్చి ఒక్కరు గాని, అందరు
గాని నన్నడుగంగవచ్చును 3.9.78

లేక మీలో ఒకరినైనా
అడుగగల్గుదు లేక అందరి
నడుగ గల్గుదు'' ననుచు బల్కిన
నెవ్వరును మాట్లాడకుండిరి 3.9.79

యాజ్ఞవల్క్యుండపుడు వారికి
ఆత్మతత్త్వమునిట్లు దెలిపె ''వ
నస్పతులలో వృక్షమెట్టులొ
ప్రాణులందున పురుషుడట్లగు 3.9.80

వృక్షమందలి ఆకులోయన
దేహమున రోమమ్ములుండును
వృక్షమందలి బెరడు కైవడి
మనిషి తనువున చర్మముండును 3 9.81

చెట్టు బెరడును గాటు పెట్టిన
బంక యెట్టుల కారుచుండునో
చర్మమును గాయమ్ము చేసిన
రక్తమట్టుల కారుచుండును 3 9.82

చెట్టు బెరడుకు క్రింది భాగము
లోని మెత్తని పొరను బోలుచు
పురుష దేహమునందు చర్మము
క్రింద మాంసము దాగియుండును 3.9.83

వృక్షమున పీచున్నయట్టుల
దేహమున బహునాడులుండును
తరువునందలి కట్టెలనగా
తనువులోపలి యెముకలుండును 3.9 84

తరువు లోపలి గుజ్జుకైవడి
తనువు లోపలి మజ్జయుండును
చెట్టు నిలబడి యున్న యట్టులె
మనిషి యుండుట చూడవచ్చును 3.9 85

వృక్షమును ఖండించినప్పుడు
తిరిగి అయ్యది చిగురువేయును
మృత్యుదేవత కూల్చినప్పుడు
పురుషుడెట్టుల బ్రతుకగల్గును? 3 9 86

మృత్యువశమున కూలినప్పుడు
మరల ఆ దేహమ్ము నందలి
వీర్యమున జీవింపగలడని
చెప్పనేర్చుట సత్యదూరము 3 9.87

వీర్యమనునది బ్రతికియుండిన
మనిషి దేహములోనె ఉండును
మనిషి యెప్పుడు మరణమొందిన
వీర్యమప్పుడు నాశమొందును 3.9.88

మూల సహితముగాగ పెరుకను
పెఱికి వేసిన మొలవకుండును
కాని పురుషుని మృత్యు దేవత
కూల్చినను అతడెట్లు బ్రతుకును ?'' 3.9.89

యాజ్ఞవల్క్యుండడుగు ప్రశ్నకు
ఏ సమాధానమ్ము చెప్పక
అచటి వారలు మిన్నకుండిన
ఆ తడే కరుణించి యిట్లనె- 3.9.90

''ఆత్మయెప్పుడు నుండునట్టిది
ఆది, అంతము లేనియట్టి ది
ఎన్నడును జన్మింపనట్టిది
ఎన్నడును నశియింపనట్టిది 3.9.91

వృక్షమును ఖండింపగా అది
చిగురువేయును కాని 'పురుషుడు
మరల ఏ గతి పుట్టు?'ననియెడి
ప్రశ్నయే తలయెత్తకుండును " 3.9.92

రాజ సభలో యాజ్ఞవల్క్యుడు
ఎవ్వరేయే ప్రశ్నలడిగిన
తగు సమాధానమ్ము లిచ్చియు
బ్రహ్మవేత్తగ కీర్తినొందెను 3.9.93

# చతుర్థాధ్యాయం

## 1. జనకునికి యాజ్ఞవల్క్యుని ఉపదేశం

యాజ్ఞవల్క్యుండొక్క రోజున
మరల జనకుని సభకు రాగా
అతడాతని బ్రహ్మవేత్తగ
గౌరవించుచు నిట్లు పలికెను 4.1 1

''యాజ్ఞవల్క్యా! నేడు నీవిటు
గోవులను గొనవచ్చినావా ?
లేక సూక్ష్మమైన తత్త్వము
లను విచారణ సేయచూతువ ?'' 4.1.2

''చక్రవర్తీ! వినుము నేనిటు
బ్రహ్మతత్త్వము నెరుగజేసియు
గోవులను గొనవస్తి, చెప్పుము
నీకు గురువులు చెప్పుదానిని'' 4.1.3

''నాకు జిత్వాశైలి యింపుగ
పలికె వాణిని బ్రహ్మమంచును
నేనునాతని పలుకులను విని
నిక్కముగ భావించుచుందును'' 4 1.4

''తల్లిదండ్రులు, గురువు శిక్షితు
డైన వానికి లోకమందున
నెట్టులుపదేశింతురో తా
నట్లు జిత్వాశైలి పలికెను 4.1.5

పలుకు వలననె పనులు సాధ్యము
లగుట, ఆతని పలుకులుచితమె
కాని, వాగ్బ్రహ్మమున కాయత
న ప్రతిష్ఠల గూర్చి తెలిపెన?'' 4.1 6

''లేదు లేదతడేమి చెప్పుడు''
''కాని యాతడు చెప్పినట్టిది
యేకపాద బ్రహ్మమే యగు
నింక నెంతయు చెప్పవలయును 4.1 7

ఈ విశాలాకాశమెల్లెడ
సుప్రతిష్ఠితమయ్యె బ్రహ్మము,
పిండమున గల వాణియే బ
హ్మమున కాయతనమ్ము, దేహము 4.1.8

వాణియే బ్రహ్మమ్ము, ప్రజ్ఞా
రూపమగు బ్రహ్మమును గొలిచెడి
వానినెప్పుడు వాణి వదలదు
సకల భూతము లతని బ్రోచును 4.1.9

బ్రహ్మమే ప్రజ్ఞా స్వరూపము
దానినే భజియింపవలయును
ప్రజ్ఞయనగా గొప్ప జ్ఞానము
దానినే గుర్తింపవలయును 4 1.10

వాక్కుతో ఋగ్యజుస్సామా
థర్వములు నితిహాస విద్యలు
నుపనిషత్తులు నిహ పరమ్ములు
దాన ధర్మములెల్ల దెలియును'' 4 1.11

''యాజ్ఞవల్క్యా! నీ సదుపదే
శమునకిత్తును వేయిగోవులు
నేన్గు బోలెడి యెద్దునొక్కటి
కాన్కలుగ గ్రహియించవయ్యా!'' 4.1.12

''గురువు శిష్యునకట్టి విద్యను
పూర్తిగా బోధింపకుండా
కాన్కలేవి గ్రహింప రాదని
తండ్రి యానతి కనుక నే గొన 4.1.13

ఇంక నే గురువైన నీ కుప
దేశమిచ్చిన నాకు చెప్పుము''
''ప్రాణమే బ్రహ్మమని పలికె– ను
దఙ్క శౌల్బాయనుడు దేవా!'' 4.1.14

తల్లిదండ్రులు, గురువు శిక్షితు
డైన వానికి లోకమందున
నెట్టులుపదేశింతురో తా
నట్లు శౌల్బాయనుడు పలికెను 4.1.15

అతని మాటలు సముచితమ్మగు
కాని ప్రాణబ్రహ్మమున కా
యతనమేదొ, ప్రతిష్ఠయేదో
కొంచెమైనను తెలిపినాడా?'' 4.1.16

''లేదు లేదతడేమి చెప్పడు''
''కానియాతడు చెప్పినట్టిది
ఏకపాద బ్రహ్మమేయగు
నింక నెంతయు చెప్పవలయును 4.1.17

ఈ విశాలాకాశ మెల్లెడ
సుప్రతిష్ఠితమయ్యె బ్రహ్మము,
పిండమున గల ప్రాణమే బ్ర
హ్మమున కాయతనమ్ము, దేహము 4 1.18

బ్రహ్మమే ప్రియమైన రూపము
అదియునాకాశమ్ము నైవడి
అంతట యును ప్రతిష్ఠితమ్మగు,
దానినే భజియింపవలయును'' 4.1.19

''ప్రియతయనగా నేమిటో వివ
రించి చెప్పుము యాజ్ఞవల్క్య!''
''ప్రియత అనగా ప్రాణమేయగు
ప్రియత ప్రాణమునుండి వెడలును 4.1.20

ప్రాణమున గల ప్రేమ చేతనె
యాజ్ఞికుండుననర్హు చేతను
యజ్ఞమును చేయించుచుండును
దానమును గైకొనుచునుండును 4.1.21

ప్రాణమున గల భయము చేతనె
క్రొత్తక్రొత్త ప్రదేశములలో
నెవ్వడేనియు చంపునోయను
భయము మిక్కిలి కలుగుచుండును 4.1.22

ప్రాణమే పరబ్రహ్మ, ప్రియా
రూపమగు బ్రహ్మమును గొలిచెడి
మానవుని ప్రాణమ్ము వదలదు
సకల భూతములతని బ్రోచును'' 4.1.23

“యాజ్ఞవల్క్యా! నీవు చేసిన
యిట్టి ఉపదేశమ్ము గైకొని
వేయిగోవుల తోడ బలమగు
ఎద్దునిత్తును స్వీకరింపుము” 4 1.24

“పూర్ణముగ నే గురువు శిష్యున
కెట్టి విద్యయు నేర్పకుండా
కాన్కలేవి గ్రహింప రాదని
తండ్రియానతి కనుక నే గొన 4.1.25

ఇంక నే గురువైన నీ కుప
దేశ మొసగిన నాకు చెప్పుము”
“చక్షువే బ్రహ్మమని పలికెను
వార్ష్ణ డనియెడి వాడు దేవా!” 4.1.26

ప్రముఖులగు ఆచార్య వర్యుల
తోడ శిక్షితుడైన వాడుప
దేశమిచ్చిన విధముగానే
పలికె బర్కుర్ వార్ష్ణ డరయగ 4 1.27

అతని మాటలు సముచితమ్మగు
కాని చక్షుర్బ్రహ్మమున కా
యతనమేదొ, ప్రతిష్ఠయేదో
కొంచెమైనను తెలిపినాడా?” 4.1.28

“లేదు లేదతడేమి చెప్పడు”
“కాని ఆతడు చెప్పినట్టిది
ఏకపాద బ్రహ్మమేయగు
నింక నెంతయు చెప్పవలయును 4.1.29

ఈ విశాలాకాశ మెల్లెడ
సుప్రతిష్ఠితమయ్యె బ్రహ్మమ్ము
పిండమున గల చక్షువే బ్ర
హ్మమున కాయతనమ్ము, దేహము 4.1.30

బ్రహ్మమే సత్య స్వరూపము
అదియు నాకాశమ్ము కైవడి
అన్ని చోట్ల ప్రతిష్ఠితమ్మగు,
దానినే భజియింపవలయును'' 4.1.31

''సత్యరూపము నుందు నీ ఉ
ద్దేశమేమో తెలియజేయుము''
''సత్యమనునది కంటి తోడనె
లోకమందున ప్రకటమయ్యెడు 4 1.32

కంటితో చూచినది సత్యము
కనుక చక్షువు పరబ్రహ్మం
బనుచు చక్షువు ద్వార బ్రహ్మము
గొలుచు వానిని విడదు చక్షువు'' 4.1.33

''యాజ్ఞవల్క్య! నీవు చేసిన
యిట్టి ఉపదేశమ్ముగైకొని
వేయిగోవుల తోడ వృషభము
నొక్క దానిని నీకొసంగెద'' 4.1.34

''పూర్ణముగ నే గురువు శిష్యున
కెట్టి విద్యనొసంగ కుండా
కాన్కలేవి గ్రహింపరాదని
తండ్రియానతి కనుక నే గొన 4.1.35

ఇంక నే గురువైన నీకుప
దేశ మొసగిన నీకు చెప్పుము''
''శ్రోత్రమే బ్రహ్మమని భార
ద్వాజుడుపదేశమ్ము నొసగెను'' 4.1.36

''ప్రముఖులగు ఆచార్య వర్యుల
తోడ శిక్షితుడైన వాడుప
దేశమిచ్చిన విధముగానే
పలికె భారద్వాజుడొప్పుగ 4.1.37

అతని పలుకులు సముచితమ్మగు
కాని శ్రోత్ర బ్రహ్మమునకా
యతన మేదొ, ప్రతిష్ఠయేదో
కొంచెమైనను చెప్పినాడా?'' 4.1.38

''లేదు లేదతడేమి చెప్పడు''
''కానియాతడు చెప్పినట్టిది
ఏకపాద బ్రహ్మమే యగు
శేషముపదేశింపవలయును 4 1.39

ఈ విశాలాకాశ మెల్లెడ
సుప్రతిష్ఠితమయ్యె బ్రహ్మము
పిండమున గల శ్రోత్రమే బ్ర
హ్మమునకాయతనమ్ము, దేహము 4 1.40

బ్రహ్మమెప్పుడనంతరూపము,
అదియు శ్రోత్రాకాశములలో
అంతటను వ్యాపించియున్నది
అందరికుపాసింపదగినది 4.1.41

''చెప్పవలయు ననంతమనగా''
''దిశల చేత ననంత మేర్పడు,
నేది దిశో బ్రహ్మాండమందున
అదియె శ్రోత్రము పిండమందున 4.1.42

కనుక శ్రోత్రము పరబ్రహ్మం
బనుచు శ్రోత్రము ద్వార బ్రహ్మము
గొలుచు వానిని విడదు శ్రోత్రము
సర్వభూతములతని బ్రోచును'' 4.1 43

''యాజ్ఞవల్క్యా! నీవు చేసిన
ఇట్టి ఉపదేశమ్ము చాలును
గో సహస్రము తోడ వృషభము
నొక్క దానిని స్వీకరింపుము'' 4.1 44

పూర్ణముగ నే గురువు శిష్యున
కెట్టి విద్య యొసంగకుండా
కాన్కలేవిగ్రహింపరాదని
తండ్రి యానతి కనుక నే గొన 4.1 45

ఇంక ఏ గురువైన నీకుప
దేశమొసగిన తెలియజేయుము''
''మనసు బ్రహ్మమ్మనుచు నాకుప
దేశమొసగెను సత్యకాముడు'' 4.1.46

''శిక్షితుండైనట్టి వానికి
తల్లిదండ్రులు, గురువు లోకము
లోన నెట్లుపదేశమిత్తురొ
అట్ల పలికెను సత్యకాముడు 4.1 47

అతని మాటలు సముచితమ్మగు
చక్రవర్తీ! ఆమనో బ్ర
హ్మమున కాయ తన ప్రతిష్ఠల
గూర్చియాతడు చెప్పినాడా?'' 4.1.48

''లేదు లేదతడేమి చెప్పడు''
''కాని యాతడు చెప్పినట్టిది
ఏకపాద బ్రహ్మమేయగు
పూర్ణము గతెలియంగ వలయును 4.1.49

ఈ విశాలాకాశమెల్లెడ
సుప్రతిష్ఠితమయ్యె బ్రహ్మము,
పిండమున గల మనస్సే బ్ర
హ్మమునకాయతనమ్ము, దేహము 4.1.50

బ్రహ్మమే ఆనంద రూప
మ్మదియు నాకాశమున వ్యాపక
మై మనస్సున నిండియున్నది
దానినే భజింయింపవలయును 4.1.51

మనో బ్రహ్మమునెరిగి ఆనం
ద స్వరూప బ్రహ్మమునుపా
సించు వానిని మనసు విడువదు
సర్వభూతములతని బ్రోచును'' 4.1.52

''యాజ్ఞవల్క్యా! నీవు చేసిన
ఇట్టి ఉపదేశమ్ము గైకొని
గోసహస్రము తోడ బలమగు
వృషభ మిత్తును స్వీకరించుము'' 4.1.53

''పూర్ణముగనే గురువు శిష్యున
కెట్టి విద్యనొసంగకుండా
కాన్కలేవి గ్రహింపరాదని
తండ్రి యానతి కనుక గైకొన 4.1.54

ఇంక నే గురువైన నీ కుప
దేశమొసగిన నాకు చెప్పుము''
''హృదయమే బ్రహ్మమని నాకుప
దేశమొసగె విదగ్ధుడొప్పుగ'' 4.1.55

''సద్గుణమ్ముల చేత నొప్పుచు
తల్లిదండ్రుల వలన శిక్షితు
డైన వ్యక్తి వచించు విధమున
పలికినాడు విదగ్ధుడెంతయు 4.1.56

అతని మాటలు సముచితమ్మగు
హృదయ శూన్యుండేమి సేయును?
కాని హృదయ బ్రహ్మ కాయత
నప్రతిష్ఠలనేమి చెప్పెను?'' 4.1.57

''లేదు లేదతడేమి చెప్పడు''
''కాని యాతడు చెప్పినట్టిది
ఏకపాద బ్రహ్మమేయగు
నింకనెంతయు తెలియవలయును 4.1.58

ఈ విశాలాకాశ మెల్లెడ
సుప్రతిష్ఠితమయ్యె బ్రహ్మము,
పిండమున గల హృదయమే బ్ర
హ్మమున కాయతనమ్ము, దేహము 4.1.59

బ్రహ్మమగును స్థితి స్వరూపము
అదియు హృదయాకాశములలో
అంతటను వ్యాపించి యుండును
దానినే భజియించేవలయును'' 4.1.60

''తెలుపు మా స్థితి రూపమేమో?''
''స్థిరంత హృదయము నుండి వెడలును
హృదయమందే అన్ని ప్రాణంలు
సుప్రతిష్ఠితమగుచునున్నవి 4.1.61

కనుక హృదయము బ్రహ్మమనుచును
తెలిసి హృదయ బ్రహ్మమునుపా
సించు వానిని విడదు హృదయము
సర్వభూతములతని బ్రోచును'' 4.1.62

యాజ్ఞవల్క్యుండిట్లు బ్రహ్మము
గూర్చి పలికిన జనకుడెంతో
సంతసించుచు కాన్కలొసగెను
కానియాతడు స్వీకరించడు- 4.1.63

## 2. జాగ్రత్ – స్వప్న – సుషుప్తి అవస్థలు

అపుడు జనకుండాదరమ్మున
యాజ్ఞవల్క్యుని చేరి మ్రొక్కుచు
తన్ను శిష్యునిగా గ్రహించియు
నాత్మ తత్త్వము తెలుపగోరెను 4.2.1

''దీర్ఘమగు మార్గమ్ము గడవగ
పథికుడే గతి నౌరథమ్ముల
సాయమొందునో, అతుల రాజా!
ఉపనిషత్ జ్ఞానమును గంటివి 4.2.2

వేదములు పఠియించినాడవు
ఉపనిషత్తులు చదివినాడవు
పూజ్యుడవు నీవిచట విడువడి
పోదువెచటికి చెప్పగలవా?'' 4.2.3

''దేవనాకిది యేమి తెలియదు
తెలియజెప్పిన తెలుసుకొనియెద''
ననగ జనకుని తోడ యిట్లనె
మేటి ఋషి యగు యాజ్ఞవల్క్యుడు 4.2.4

''ఆత్మతత్త్వము తనను కన్నుల
నుండి వెల్వడ జేయునెప్పుడు,
దేహమున కుడి కంటి వలనను
చూచు పురుషుండింధుడనబడు 4.2.5

ఇంధుడనగా ఇంద్రుడేయగు
దీప్తిమంతుండింధుడనబడు
'ఇంధు'డే ప్రత్యక్ష నామము
'ఇంద్రు'డ ప్రత్యక్ష నామము 4.2 6

దేవతలు ప్రత్యక్ష నామము
కంటెనప్రత్యక్ష నామము
నిష్టపడుదురు, స్పష్టముగ పిలు
వంగ బడమి ప్రియమ్ము వారికి 4.2.7

వామనేత్రము నుండి చూసెడి
ఆత్మతత్త్వమె ఇంద్రసతి, ప్ర
త్యక్ష నామమ్మగు విరాట్టు, ప
రోక్షమగు నామమింద్రాణియె 4.2.8

ఆత్మతత్త్వమ్మింద్ర, యింద్రా
ణులుగ జాగ్రదవస్థ లోపల
కనుల యందున నిలిచి బయటికి
చూచినట్లనిపించుచుండును 4.2.9

ఇంద్రుడన, ఇంద్రాణియనగా
రెంటికర్థము 'దీప్తి', జగమున
దీప్తియనగా జ్ఞానమే, అది
ఆత్మకపరోక్ష స్వరూపము 4.2.10

ఇంద్ర, యింద్రాణులకు సుందర
మేళన స్థానమ్ము హృదయపు
టంతరాకాశమ్ము, చెల్లా
చెదరు వృత్తులకైక్య వేదిక 4.2.11

అచట స్వప్నావస్థలో మన
ఆత్మ మిక్కిలి వెలుగుచుండును
కాని, జాగ్రదవస్థ యందున
తినెడి త్రాగెడి పనులు చూచును 4 2.12

అకట! స్వప్నావస్థ లోపల
ఆత్మకెయ్యది భోజనమ్మని
సంశయించిన, హృదయ లోహిత
పిండమని వచియించుటుచితము 4.2.13

మృత్యువావేశించుదాకా
దేహమున హృదయమ్ము వలనే
రక్త సంచాలనము జరుగును
ఆత్మయనునది నిలువగలుగును 4.2.14

నేత్రమార్గము నందు జాగ్రద
వస్థ లోపల; హృదయ గగనము
నందు స్వప్నావస్థ లోపల
ఇంద్ర, యింద్రాణులు భ్రమింతురు 4.2.15

వారు హృదయము లోని నాడుల
వలన చిక్కుచు నప్పుడప్పుడు
పైకి వెడలెడి నాడి లోపల
సంచరింపగ చూచుచుందురు 4.2.16

ఒక్క కేశము వేయి చీలిక
లైన, నేర్పడు సూక్ష్మభాగము
లట్లు సూక్ష్మమ్మైన నాడులు
హృదయమందున వ్యాప్తి చెందును 4.2.17

వాటిని హితానాడులందురు
వాటి నుండి లభించు శుద్ధా
హారమును గొని ఆత్మ స్వప్నా
వస్థ లోపల సంచరించును 4.2.18

ఆత్మ జాగ్రదవస్థ లోపల
నేత్రమున వసియించుచుండును
స్వప్నములు గనునపుడు హృదయపు
టంతరాకాశమున నుండును 4.2.19

తా సుషుప్తిని పొందినప్పుడు
ఆత్మ ప్రాణమునందు నిలుచును
ఎట్టి స్థితిలో నైన అయ్యది
నిదుర గాంచదు, నిదుర లేవదు 4.2.20

భిన్న భిన్నములగు అవస్థల
లోన, దేహమ్ముండిపోగా
ఆత్మ మాత్రము తనకు వీలగు
స్థానములలో వెలుగుచుండును 4 2.21

గాఢ నిద్ర సుషుప్తి యనబడు,
గాఢ నిద్రావస్థలో మన
దేహముండిన, ఆత్మ పంచ
ప్రాణములలో నిలిచియుండును 4.2.22

ఆత్మ జాగ్రదవస్థలో నే
త్రములకైవడి, స్వప్నమున హృద
యమ్ము రీతి, సుషుప్తిలో ప్రా
ణముల భంగి వెలుంగుచుండును 4.2.23

పూర్వ దక్షిణ పశ్చిమోత్తర
భాగములలో, ఊర్ధ్వ దిశలో
ఆత్మరూపము ప్రాణమయమై
అలరుచుండుట తెలియవలయును 4.2.24

ఆత్మతత్త్వమ్మునకు రూప
త్రయముగాక విశేషమైన తు
రీయ రూపంబొకటి యున్నది
అది అనిర్వచనీయమైనది 4.2.25

'నేతినే' తని చెప్పబడు ఆ
రూపమెవరికి తెలియనట్టిది
చేతికందక, నాశమొందక
లిప్తమవ్వక వెలుగునట్టిది 4.2 26

సార్థకమ్ముగు పేరు గల ఓ
చక్రవర్తీ! ఉపనిషత్తుల
జ్ఞానమును సాధించినాడవు
ఆత్మతత్త్వము తెలిసినాడవు 4.2.27

కనుక నీవిట నుండి విడువడి
చేతికందని నాశమొందని
బంధ రహితంబైన రూపము
నందు చేరి సుఖించువాడవు 4.2.28

అపుడు నీకిక భయము లే'' దని
యాజ్ఞవల్క్యుడు పలుక నట్టిది
కలుగు నీకని తనను, తన రా
జ్యమును జనకుండతనికిచ్చెను 4.2.29

## 3. జనకునికి యాజ్ఞవల్క్యుని ఆత్మోపదేశం

ఆత్మచర్చలు జరుగు నవసర
మందు జనకుడు మాటలాడిన
తీరునకు సంతుష్టుడగుచును
యాజ్ఞవల్క్యుడు వరమొసంగెను 4.3.1

ఇష్టమగు విషయమ్ము నడుగగ
వర మొసంగిన వాడు కావున,
యాజ్ఞవల్క్యుడు జనకుడడిగిన
దానికుత్తరమీయదలచెను 4.3.2

''ఓ మునీంద్రా! ఆత్మతత్త్వము
తెలియుగోరెద, జ్యోతి- పురుషుని
కెచటి నుండి లభించుచున్నది
కరుణ తోడను తెలియజేయుము'' 4.3.3

''అధిప! జాగ్రదవస్థలో పురు
షుండు సూర్యుని జ్యోతి తోడనె
లేచి కూర్చొను, తిరుగు, కర్మలు
చేసి స్వస్థానమ్ము చేరును'' 4.3.4

యాజ్ఞవల్క్యా! మీరు చెప్పిన
దెంతయును సత్యమ్ము, సూర్యుం
డస్తమించిన,జ్యోతి – పురుషున
కెచటి నుండి లభించునో కద!'' 4.3.5

''అధిప! సూర్యుండస్తమించిన
అతడు చంద్రుని జ్యోతి తోడనె
లేచి కూర్చొను, తిరుగు, కర్మలు
చేసి స్వస్థానమ్ము చేరును'' 4.3.6

''యాజ్ఞవల్క్యా! మీరు చెప్పిన
దెల్ల సత్యము, కాని చంద్రుం
డస్తమించిన,జ్యోతి– పురుషున
కెచటి నుండి లభించునో కద!'' 4.3 7

''అధిప! చంద్రుండస్తమించిన
అగ్ని యొక్క ప్రకాశముననే
లేచి కూర్చొను, తిరుగు, కర్మలు
చేసి స్వస్థానమ్ము చేరును'' 4.3.8

''యాజ్ఞవల్క్యా! మీరు నుడివిన
దెల్ల సత్యము, కాని అగ్నియు
నస్తమించిన,జ్యోతి– పురుషున
కెచటి నుండి లభించునో కద?'' 4.3.9

''అధిప! అగ్నియు నస్తమించిన
అంధకారములోన పురుషుడు
వాణి యొక్క ప్రకాశముననే
కార్యములు నెరవేర్చగలుగును 4.3.10

చిమ్మచీకటిలోన తన హ
స్తమ్ము కనబడకున్ననేమిటి?
వాక్కు సాయముతోడ పనులను
నేర్పుతో సాగించుచుండును'' 4.3.11

''యాజ్ఞవల్క్యా! మీరు చెప్పిన
దెల్ల సత్యము, వాక్కు స్వప్నా
వస్థలో పని సేయకుండిన,
జ్యోతి- పురుషునకెట్లు దొరుకును?'' 4.3.12

''అధిప స్వప్నావస్థ లోపల
వాణి పనులను చేయకున్నను
ఆత్మ యొక్క ప్రకాశముననే
పురుషుడనువాడుండగలుగును 4.3.13

''యాజ్ఞవల్క్యా! మీరు చెప్పిన
దెల్ల సత్యము, కాని స్వయముగ
వెలుగుచుండెడి ఆత్మ ఎవరో
నీదు శిష్యునకెరుగ జెప్పుము?'' 4.3.14

''ఆత్మ జాగ్రదవస్థ లోపల
నేత్రములలో, స్వప్నమున హృద
యమ్ములోన, సుషుప్తి లోపల
ప్రాణములలో వెలుగుచుండును 4.3.15

మేలుకొనుచో పనులు సేయుచు,
కలలు గనుచో మృత్యురూప జ
గత్తునెంతయు దాటిపోవు, సు
షుప్తిలో ధ్యానమున నుండును 4.3.16

పుట్టినప్పుడు పురుషుడకటా
దేహబద్ధుండగుచు పాపా
సక్తుడగు, మరి చచ్చినప్పుడు
పాపముల విడువడిన యట్లగు 4.3.17

ఆత్మజాగ్రత్ లోకమందున
దోషములలో చిక్కి, స్వప్నసు
షుప్తులందునుజేరినప్పుడు
పాపముల విడనాడినట్లగు 4.3.18

ముఖ్యమగు స్థానములు రెండే
ఒకటి జాగ్రత్ స్థానమగు, వే
రొకటి చూడ సుషుప్తియగు, స్వ
ప్నమ్ము సంధిస్థానమాత్మకు 4.3.19

సంధియగు స్వప్నమ్ము నందలి
పురుషుడెట్టి క్రమమ్ము తోడ సు
షుప్తి జేరునొ ఆక్రమమ్మున
పాపమును, ఆనందమును గను 4.3.20

ఆత్మ జాగ్రత్ స్థితిని వీడి, సు
షుప్తికేగుచు పాపమును గను
ఆ సుషుప్తిని వీడి జాగ్రత్
స్థితిని జేరుచు మోదమును గను 4.3.21

ఆత్మజాగ్రత్ స్థితిని కాదని
స్వప్నలోకము జేరబోవుచు
సూక్ష్మ విషయములెన్నియో తన
వెంట గైకొని పోవుచుండును 4.3.22

స్వప్నలోకము నందు సూక్ష్మాం
శములతో నొక దివ్యలోకము
సిద్ధపరుచుచు, భగ్నపరుచుచు
తాను మాత్రము వెలుగుచుండును 4.3.23

తన ప్రకాశమునందె పురుషుడు
స్వప్నలోకము గాంచుచుండును
కనుక నాతని స్వయంజ్యోతిగ
నాత్మ విదులు గణించుచుందురు 4.3.24

స్వప్న పురుషుని కాత్మలోకమె
సిద్ధమగుచును భగ్నమగుచును
అనుభవమ్మగు, దానినాతడు
తన ప్రకాశముతోనె గాంచును 4.3.25

స్వప్నమున రథ రథ్యములు, మా
ర్గమ్ము లేవియు నుండకున్నను
స్వప్న పురుషుడు వాటినెల్ల సృ
జించుకొని క్రీడించుచుండును 4.3.26

నిక్కముగ స్వప్నమ్ము లోపల
మోదమేని ప్రమోద మేని ల
భింపకుండును, కాని వాటిని
స్వయముగా సృజియించునాతడు 4.3.27

అట సరస్సులు కానిపింపవు
అందమగు సెలయేరులుండవు
నదులు కూడా లేవు, కాని సృ
జించునాతడె కర్తయగుచును 4.3 28

ఆత్మ జాగ్రత్ స్థానమును విడ
నాడి స్వప్నము చేరినప్పుడు
నిదుర వోవక తాను సుప్తేం
ద్రియములను తిలకించుచుండును 4 3.29

విడిచి స్వప్నము మరల జాగ్రత్
స్థితికి వచ్చిన, హంస వలె తన
జ్యోతినిమ్మగ దెచ్చి బయటికి
దేహమున జాగృతిని కూర్చును 4.3.30

ఈ హిరణ్మయ పురుషుడొక్కడు
అమర హంసము వోలె దేహం
బనెడి గూటిని గావ స్వయముగ
స్వప్నలోకము నందు దిరుగును 4.3 31

స్వప్నలోకము నందు పురుషుం
డెగుడు దిగుడుల ననుభవించును
కామరూపములల్లుకొనుచును
స్త్రీలతో క్రీడించుచుండును 4.3.32

బంధువులతో తిరుగుచుండును
హాస్యవచనము లాడుచుండును
వెంట వెంటనె భయము గొలిపెడి
దృశ్యములు పరికించుచుండును 4.3.33

ఆత్మ స్వప్నావస్థ లోపల
ఉండినప్పుడు దేహమును విడ
నాడి అయ్యది యెచటనో విహ
రించునని భావించుచుందురు 4.3.34

కనుకనే నిద్రించునాతని
లేపవలదని చెప్పుచుందురు
లేపినను సర్వాంగములలో
వెంటనే రాకుండునందురు 4.3.35

కాని అది సరి కాదు, నిజమున
కాత్మ స్వప్నములోన జూచిన
దెల్ల జాగ్రదవస్థ నుండి గ్ర
హించినట్టిది మాత్రమేయగు 4.3.36

మనము జాగ్రదవస్థ లోపల
ఏది చూతుమొ, ఏది విందుమొ
దానినే స్వప్నమ్ము లోపల
చూడగలము మరియు వినగలము 4.3.37

ఆత్మ ఎప్పుడు వెలుపలుండక
తాను జాగ్రదవస్థ లోపల
ఏది చూచునొ, దానినే స్వ
ప్నమ్ములోపల గాంచుచుండును 4.3.38

ఆత్మ జాగ్రదవస్థ లోపల
సూర్యచంద్రాదుల ప్రకాశము
పొందగలిగియు, స్వప్నమందున
స్వయం జ్యోతిగ నిలువగలుగును'' 4.3.39

యాజ్ఞవల్క్యుని పలుకులను విని
''గో సహస్రము నిత్తునింకను
నాకు మోక్షము గూర్చి ఉపదే
శింపు''డని జనకుండు గోరెను 4.3.40

సంప్రసాదమునందు ఆనం
దించి, ఇదివరకెట్టి మార్గము
నందు వచ్చెనొ, అట్టి మార్గము
నందె స్వప్నము నాత్మ జేరును 4.3.41

ఆత్మ తాను సుషుప్తి లోపల
అనుభవించినదెల్ల అటనే
నిలిచిపోవు, నసంగుడగుటయె
దానికంతకు కారణమ్మగు 4.3.42

''అదియు సరియగు నో మహర్షీ!
మీరలీ ఉపదేశమిచ్చిన
కారణమ్మున గోసహస్రము
నిత్తు, మోక్షమునింక తెలుపుడు 4.3.43

''స్వప్నమందున ఆత్మ సంతో
షించి, ఇదివరకెట్టి మార్గము
నందు వచ్చెనొ, అట్టి మార్గము
నందె జాగ్రత్ స్థితిని చేరును 4.3.44

ఆత్మ స్వప్నావస్థ యందున
ననుభవించిన దెల్ల అటనే
నిలిచిపోవు, నసంగుడగుటయె
దానికంతకు కారణమ్మగు'' 4.3 45

''మీరు పలికినదెల్ల నిజమే
నాకొసంగిన యిట్టి ఉపదే
శమ్మునకు నే గోసహస్రము
నిత్తు, మోక్షమునింక తెలుపుడు 4.3.46

''ఆత్మ జాగ్రదవస్థ లోపల
తిరిగి, ఇది వరకెట్టి మార్గము
లోన వెళ్లెనొ, అట్టి మార్గము
నందె స్వప్న స్థితిని చేరును 4.3.47

చేప ఈ దరి నుండి ఆ దరి
కేగుచును దరులందు కోరిక
చూపనట్టులె ఆత్మ జాగ్రత్
స్వప్నముల తిరుగాడుచుండును 4.3.48

డేగయేనియు, గరుడుడేనియు
గగనమున నెగిరెగిరి చివరికి
రెక్కలను ముకుళించుకొని వి
శ్రాంతి కొరకై గూటికేగును 4.3.49

ఆత్మ జాగ్రత్ స్వప్నములలో
తిరిగి తిరిగీ చిట్టచివరికి
చేరిపోవు సుషుప్తిలోనికి
కలలు కలతలు లేని చోటికి 4.3.50

ఒక్క కేశము వేయి చీలిక
లైన, నేర్పడు సూక్ష్మభాగము
లట్లు తనువున హితానాడులు
సూక్ష్మమై వ్యాపించి యుండును 4.3.51

పురీతతములె హితానాడులు
వాటిలో శుక్లమ్ము మొదలుగ
నీల, పింగళ, హరిత, లోహిత
వర్ణములు గల రసములుండును 4 3.52

హితానాడులలోన నొకటగు
సూక్ష్మమైన సుషుమ్న లోపల
ఆత్మ తిరుగుచునుండు, దేహము
నిదుర వోయెడి సమయమందున 4.3.53

ఆత్మ జాగ్రదవస్థ లోపల
దేనితో భయపడునో, స్వప్నా
వస్థ లోపల దాని తోడనె
తరచుగా భయపడుచునుండును 4.3.54

ఆత్మ అజ్ఞానమ్ము చేతనె
తననెవండో చంపుననుకొను
ఎవ్వడో వశపరుచుననుకొను
ఎవ్వడో వెంటాడుననుకొను 4.3.55

ఎట్టి స్థానము జేరి పురుషుడు
కేవలాత్మగ నిలిచిపోవునో
అది సుషుప్తి, అది పరలోకము
అది మనోరథ రహిత రూపము 4.3.56

అదియె కోర్కెలు లేని రూపము
అదియె పాప విరహిత రూపము
అదియె ఆత్మకశోక రూపము
అదియె ఆత్మకకామరూపము 4.3.57

ఎటుల పురుషుడు సతిని కౌగిట
జేర్చి సర్వము మరవ గలడో
అటుల ప్రాజ్ఞాత్మకు సమీప
మ్మగుచు నాత్మయు మరచు సర్వము 4.3.58

ఆప్త కాముండైన పురుషుడు
తనదు ఆత్మనె కోరుచుండును
ఆత్మ కాముండైన వానికి
అన్య కామనలుండ నేరవు 4.3.59

ఆత్మకాముండైన వానికి
ఎవరు తండ్రీ? ఎవరు తల్లీ?
ఏది లోకము? ఏది దేవత?
ఏది వేదము చెప్ప గలరా ? 4.3.60

ఎవరు దొంగలు? ఎవరు దొరలో?
ఎవరు శ్రమణులు? ఎవరు మునులో?
ఎవరు తక్కువ? ఎవ్వరెక్కువో
ఎవ్వరైనా చెప్పగలరా? 4.3.61

ఆత్మ కాముండైన పురుషుడు
పాప పుణ్యములంటకుండును
హృదయ సాగరమందు నిలిచిన
దుఃఖ జలమును దాటగల్గును 4.3.62

గాఢ నిద్రా కలితుడై పురు
షుండు దేనిని గాంచకుండును
కాని ఆతని దృష్టికెప్పుడు
లేదు భంగము, ద్రష్ట ఆతడు 4.3.63

నాశమొందని తత్త్వమాత్మ, సు
షుప్తిలో తన కంటె భిన్నం
బైన దృశ్యం బొకటి యుండదు
కనుకనే వీక్షింపకుండును 4.3.64

గాఢ నిద్రా కలితుడై పురు
షుండు వాసన చూడకుండును
కాని ఆతని ఘ్రాణశక్తికి
లేదు భంగము, ఘ్రాత ఆతడు 4.3.65

నాశమొందని తత్త్వమాత్మ, సు
షుప్తిలో ఘ్రాణింపగలిగిన
భిన్న వస్తువు లేక యుండును
కనుక ఆఘ్రాణింపకుండును 4.3.66

గాఢ నిద్రా కలితుడై పురు
షుండు రుచులను చూడకుండును
కాని ఆతని రసన కెన్నడు
లేదు భంగము, రసయితాతడు 4.3.67

నాశమొందని తత్త్వమాత్మ, సు
షుప్తిలో రుచి చూడ గల్గిన
వస్తువేదియు లేక యుండును
కనుకనే రుచి చూడకుండును 4.3.68

గాఢ నిద్రా కలితుడై పురు
షుండు మాటలు పలుకకుండును
కాని ఆతని వాణికెప్పుడు
లేదు భంగము, వక్త ఆతడు 4.3.69

నాశమొందని తత్త్వమాత్మ, సు
షుప్తిలో మాట్లాడగల్గిన
వస్తువేదియు లేకయుండును
కనుకనే మాట్లాడకుండును 4.3.70

గాఢ నిద్రా కలితుడై పురు
షుండు దేనిని వినక యుండును
కాని ఆతని శ్రుతికి యెన్నడు
లేదు భంగము, శ్రోత ఆతడు 4.3.71

నాశమొందని తత్త్వమాత్మ, సు
షుప్తిలో తన కంటె భిన్నము
గావినందగు వస్తువుండదు
కనుకనే వినకుండునాతడు 4.3.72

గాఢ నిద్రా కలితుడై పురు
షుండు మననము సేయకుండును
కాని యాతని మనశ్శక్తికి
లేదు భంగము, మంత ఆతడు 4 3.73

నాశమొందని తత్త్వమాత్మ, సు
షుప్తిలో తన కంటె మననము
సేయగలిగిన వస్తువుండదు
కనుకనే మననమ్ము సేయడు 4.3.74

గాఢ నిద్రా కలితుడై పురు
షుండు దేనిని తాకకుండును
కాని ఆతని స్పర్శశక్తికి
లేదు భంగము, స్ప్రష్ట ఆతడు 4.3.75

నాశమొందని తత్త్వమాత్మ, సు
షుప్తిలో కనరాదు తన కం
టెను స్పృశింపందగిన వస్తువు
కనుకనే స్పర్శించకుండును 4.3.76

గాఢనిద్రా కలితుడై పురు
షుండు జ్ఞానము పొందకుండును
కానియాతని జ్ఞాన శక్తికి
లేదు భంగము, జ్ఞాత ఆతడు 4.3.77

నాశమొందని తత్త్వమాత్మ, సు
షుప్తిలో కనరాదు తన చే
తెలుసుకొనదగినట్టి వస్తువు
కనుకనే తెలియంగ నేరడు 4.3.78

గాఢనిద్రా కలితుడైనవు
డాత్మ కంటెను భిన్నమగుచును
ఆత్మ చేత గ్రహింప గల్గిన
వస్తువేదియు లేకయుండును 4.3.79

కనుక అట తిలకింప, ఆఘ్రా
ణింప, ఆస్వాదింప, మాట్లా
డింప, ఆలింప, చింతింప, స్పృ
శింప, గ్రహింప బూన దాత్మయు 4.3.80

ఆత్మ యెపుడు సుషుప్తి లోపల
శుద్ధ జలమును బోలియుండును
స్వచ్ఛమై వెలుగొందు ఆత్మకు
భిన్నమైనది ఏది ఉండదు 4.3.81

ఆత్మ నిజ రూపమ్ము తెలియగ
ఈ సుషుప్తిని గూర్చి ఉపదే
శించితిని, ఇది ఎట్టిదనగా
బ్రహ్మలోకపు మెఱుపు వంటిది 4.3.82

ఆత్మ నిజరూపమ్ము తెలిసిన
అదియె పురుషుని పరమ సంపద
పరమ గమ్యము, పరమ లోకము
పరమ సౌఖ్యానంద నిలయము 4.3.83

బద్ధ జీవులు పొందు సౌఖ్యం
బసలు బ్రహ్మ జ్ఞాని పొందెడి
నిర్మలానందమ్ము లోపల
లేశమాత్రంబని యెఱుంగుము 4.3.84

అంగ సౌష్ఠవమున్న వానిని
మనుజులందు సమృద్ధుడందురు
సర్వభోగములున్న వానిని
మానవాళికి నేత యందురు 4.3.85

సర్వ విధ భోగమ్ములుండిన
కలుగు ఆనందమ్ము మాటల
కందనట్టిది, కనుక పరమా
నందమని వచియింత్రు దానిని 4.3.86

ఇట్టి పరమానంద శతమును
సమముగా లెక్కింపవచ్చును
లోకములను జయించి పితరులు
పొందు ఆనందమ్ము తోడను 4.3.87

అట్టి పితరులు పొందగల ఆ
నందములు నూరైన చో గం
ధర్వ లోకానందమున కవి
సాటి యగునని తెలియవలయును 4.3.88

నూరు గంధర్వానందములు
కర్మచే దేవత్వమందిన
కర్మ దేవుల ఒక్క ఆనం
దమ్ముతో సమమగుట నిక్కము 4.3.89

కర్మ దేవులు పొందు ఆనం
దములు నూరై సాటి రాగల
వంచితమ్ముగ జన్మదేవుల
ఒక్క ఆనందమ్ము తోడను 4.3.90

ఇట్టి ఆనందమ్ము శ్రోత్రియు
డైన వానికి, పాపములు లే
నట్టి వానికి, కామనా రహి
తునికి మాత్రమె దొరుకుచుండును 4.3.91

జన్మదేవులు పొందు ఆనం
దములు వందయు లోకమందున
సాటి రాగల వొక ప్రజాపతి
భవ్యలోకానందమునకును 4.3.92

ఇట్టి ఆనందమ్ము శ్రోత్రియు
డైన వానికి, పాపములు లే
నట్టి వానికి, కామనా రహి
తునికి మాత్రమె దొరుకుచుండును 4.3 93

ఆ ప్రజాపతి భవ్యలోకా
నంద శతమొక బ్రహ్మలోకా
నందమునకు సమానమగునని
బ్రహ్మవేత్తలు పలుకుచుందురు 4.3.94

ఎట్టి సంశయమ్ము శ్రోత్రియు
డైన వానికి, పాపములు లే
నట్టి వానికి, కామనా రహి
తునికి మాత్రమె దొరుకుచుండును'' 4.3.95

యాజ్ఞవల్క్య మహర్షి జనకుని
కిట్లు బ్రహ్మజ్ఞాని పొందెడి
గొప్ప ఆనంద స్వరూపము
తెలియజేసియు మిన్నకుండెను 4.3.96

జనకుడందుకు సంతసించుచు
నీవొసంగిన దివ్య సందే
శమునకిచ్చెద గో సహస్రము
నింక మోక్షము తెలుపుడనియెను 4.3.97

యాజ్ఞవల్క్యుండాత్మ గతమున
చక్రవర్తి అభీష్టమెంచుచు
తనను పరమ రహస్యమెరుగగ
వివశు జేయునటంచు దలచెను 4.3.98

''పుణ్యపాపములెల్ల జూచుచు
ఆత్మ ఎట్టుల స్వప్నలోకము
చేరబోవునొ, అట్లు జాగ్రత్
స్థానమునకును తిరిగి వచ్చును 4.3.99

జాగ్రదాదియవస్థలకు తా
వచ్చి పోవుచు నున్న యట్లే
ఆత్మ ఒక దేహమును విడిచి మ
రొక్క దేహము లోనికేగును 4.3.100

చేరవలసిన చోటు చేరుచు
బండి బరువును దింపినట్లుగ
తనువు జాగ్రద్రూప యాత్ర ము
గించి ఆత్మను దింపి వేయును 4.3.101

రోగ వార్ధక్యములచే దే
హాంగములు కృశియించి పోయిన
చెట్టు విడివడి పండు రాలిన
రీతి పురుషుడు తొలగి పోవును 4.3 102

రాజు రాక యెరింగి సేవకు
లతని సేవకు నిలిచినట్లుగ
భూత జాతమ్మెల్ల బ్రహ్మ
జ్ఞాని కొరకై ఎదురు చూచును 4.3.103

రాజు వెడలు టెరింగి సేవకు
లతని వెంటనె తరలునట్లుగ
అంత్యకాలము నందు ప్రాణేం
ద్రియము లాతని వెంబడించును 4.3.104

సేవకులచే రాజు విడివడి
రాజ పథమున వెడలునట్లే
సర్వమును విడనాడి యోగియు
మోక్ష పథమున సాగిపోవును" 4.3.105

## 4. పునర్జన్మ వర్ణనం

తనువు దుర్బలమైన యప్పుడు
మనసు చురుకుగ పనులు సేయదు
ఇంద్రియమ్ములు – ఒక్కటగుచును
ఆత్మ ప్రక్కన చేరి పోవును 4.4.1

ఇంద్రియమ్ముల నుండి తేజము
లాగి వైచిన ఆత్మ దానిం
గూడి హృదయము నందు జేరును
నిజముగా ఆ తేజమాత్మదె 4.4.2

నేత్రమున కూర్చుండి పురుషుడు
చూడనేర్చును బయటి దృశ్యము
కాని లోపలి కేగి నప్పుడు
వినడు, చూడడు, తెలియజాలడు 4.4.3

పురుషుడుత్సాహమ్ముతో తన
శక్తులను వెలుపలికి పంపును
కాని లోగొని నపుడనేకత
నుండి ఏకత లోనికేగును 4.4.4

మరణ సమయములోన ఇంద్రియ
శక్తులను లోగొన్న పురుషుని
గాంచి 'ఏకీభూతుడైనా'
డనుచు లోకులు చెప్పుకొందురు 4.4.5

గంధమాఘ్రాణింపకుండిన,
రుచులు చూడక, మాటలాడక
వినక, దేనిని తాకకుండిన
నతని'నేకీ భూతు' డందురు 4.4.6

క్రమముగా అతడక్షి యుగమును
విడిచి, హృదయాగ్రమ్ము జేరిన
ఉజ్జ్వలమ్మగు కాంతి లోపల
ఆ ప్రదేశము వెలిగిపోవును! 4.4.7

ఆత్మ తనదగు జ్యోతి తోడనె
కనుల నుంచో, మూర్ధ్న నుంచో
ఈ శరీరములోని ఏ అం
గమ్ము నుంచో వెడలిపోవును 4.4.8

వెడలిపోయే ఆత్మ వెంబడి
ప్రాణములు పయనించుచుండును
నిలువజాలక ఇంద్రియమ్ములు
ప్రాణములతో సాగిపోవును 4.4.9

మరణ సమయము నందు పురుషుడు
జ్ఞానమును కోల్పోయి యుండును
కాని ఆతనిమ్రోల జీవన
దృశ్యములు నర్తించుచుండును 4.4.10

తనువు వీడుచు తనువు జేరుచు
జీవయాత్ర ఘటించు వానిని
విద్యయును, కర్మయును, పూర్వ
ప్రజ్ఞయును వెంటాడుచుండును 4.4.11

తృణజలాయుక మెట్లు తృణమున
జేరి రెండవ తృణము మీదికి
తనను జేర్చునొ, యట్లు పురుషుడు
తనువు వీడియు తనువు జేరును 4.4.12

అగ్ని సంపర్కమున స్వర్ణము
శుద్ధరూపము గాంచునట్లుగ
విద్యవలనె ఆత్మ తనువును
విడిచి పుణ్యాకృతిని దాల్చును 4.4.13

ఆత్మ తనదగు విద్య చేతను
కర్మ చేతను, పూర్వ విజ్ఞా
నమ్ము చేతను సృష్టిలో పు
త్రాది రూపము లొందుచుండును 4.4.14

ఆత్మకీ లోకమ్ములో గల
వస్తు సంబంధమును బట్టియె
బద్ధరూపము కలిగి తత్ఫల
మనుభవమునకు వచ్చుచుండును 4.4.15

జ్ఞాన సంబంధమ్ముచే వి
జ్ఞానమయుడగు, మనసుచే సం
యుక్తుడైన మనోమయుండగు
ప్రాణములచే ప్రాణమయుడగు 4.4.16

నేత్ర సంబంధమ్ము చేతను
నేత్రమయుడై తేజరిల్లును
శ్రోత్ర సంబంధమ్ము చేతను
శ్రోత్రమయుడై అలరుచుండును 4.4 17

పృధివిచే పృధివీ మయుండగు
జలము చేతనె జలమయుండగు
అగ్ని చెతనె అగ్నిమయుడగు
వాయువంటుచు వాయుమయుడగు 4.4.18

నభము చేత నభోమయుండగు
దేని చేతను దాని రూపము
కలిగినట్లే, దేని విడిచిన
దాని రూపము తొలగిపోవును 4.4.19

అగ్ని చేతనె అగ్నిమయుడగు
అగ్ని విడిచి అనగ్నిమయుడగు
కామములచే కామమయుడగు
తొలగిపోయి అకామమయుడగు 4.4.20

క్రోధమునబడి క్రోధమయుడగు
క్రోధమును విడనాడి మునియగు
ధర్మమున బడి ధర్మమయుడగు
ధర్మమును విడనాడి ఖలుడగు 4.4.21

ఎట్టి కర్మను చేయ నేర్చిన
అట్టి రూపమె కలుగుచుండును
కర్మయొక్కటి రూపమొక్కటి
కల్గుగబోవని తెలియవలయును 4.4.22

పుణ్య కర్మల నాచరించిన
పుణ్యఫలములననుభవించును
దుఃఖ కర్మల నాచరించిన
దుఃఖ సాగరమీదుచుండును 4.4.23

ఎంత ఆలోచించినప్పటి
కొకటి నిజమని తేలుచున్నది
పురుషుడనువాడీ జగమ్మున
కామమయుడని తెలియుచున్నది 4.4.24

మనిషి కోర్కెను బట్టి యత్నము
మనిషి యత్నము బట్టి కర్మము
మనిషి కర్మము బట్టి దేహము
మనిషి దేహము బట్టి భోగము 4.4.25

ఎట్టి కోర్కెలతోడ మనిషి మ
నశ్శరీరము లేకమగునో
అట్టి కర్మల వైపుకతడా
కర్షితుండై పోవుచుండును 4.4.26

ఒక్క కర్మను పూర్తిసేయుచు
ఒక్క కర్మను మొదలువెట్టుచు
కర్మలే లోకమ్ము గాగా
కామనామయుడైచరించును 4.4.27

అన్య కామనలుండనేరని
ఆత్మకాముడు, ఆప్తకాముడు
మరియు నిష్కాముడు జగమ్మున
పిలువబడును 'అకామమయు' డని 4.4.28

ఆత్మ కామునిలోన ఆత్మకు
భిన్న కామనలుండనేరవు
పూర్వమున ఒకవేళ ఉండిన
అవియు నన్నియు తొలగిపోవును 4.4.29

ఆత్మ కాముని ప్రాణమతనికి
తెలియకుండనె పోదు, జీవ
న్ముక్తుడాతడు, బ్రహ్మమో యన
లోకమున భాసించుచుండును 4.4.30

ఎవని హృదయము లోని కామన
లన్నియును నశి యించి పోవునొ
ఆతడమరుండగుచు ఈ లో
కమున బ్రహ్మానందమొందును 4.4.31

పాము విడిచిన కుబుస మే గతి
చచ్చిపడినట్లుండునో, అ
ట్లుండు బ్రహ్మజ్ఞాని దేహము
కాని, అందలి ఆత్మ అమృతము !'' 4.4.32

యాజ్ఞవల్క్యుని పలుకులకు ముద
మొంది జనకుడు గో సహస్రము
నిత్తుననియెను కాని, ఋషి అది
యేమి పట్టక యిట్టులనియెను 4.4.33

"సూక్ష్మమైనది బ్రహ్మమార్గము
అది సనాతనమైన మార్గము
దాని నేను స్పృశించినాడను
దాని నేను గ్రహించినాడను 4.4.34

భవ్యమగు ఆ మార్గముననే
బ్రహ్మవేత్తలు సాగుచుందురు
దివ్యలోకములందు నిలుచుచు
ఊర్ధ్వలోకము జేరుచుందురు 4.4.35

సూక్ష్మమగు ఆ మార్గముననే
శుక్ల, పింగల, నీల, లోహిత
హరిత వర్ణజ్యోతులెప్పుడు
నిలిచి స్వాగతమొసగుచుండును 4.4.36

బ్రహ్మమును దర్శించు మార్గము
వేదముల ద్వారమున తెలియును
బ్రహ్మవిదులా మార్గమున జని
బ్రహ్మపదమును గాంచుచుందురు 4.4.37

భౌతికమ్మగు దాని గొలిచెడి
వారలజ్ఞానమున నుందురు
కేవలాత్మను గొలుచువారలు
గొప్ప అజ్ఞానమున నుందురు 4.4.38

ప్రకృతి పురుషుల తారతమ్యము
తెలుగ జాలని మూఢులే అ
జ్ఞానబంధుర లోకములలో
పుట్టుచుందురు చచ్చుచుందురు 4.4.39

నేను నిత్యుడననుచు ఆత్మను
గుర్తెరింగిన వ్యక్తి – దేహము
విడిచి దేహము పొందుటనియెడి
జ్వరముతో దుఃఖింప నేరడు 4.4.40

ఈ శరీరారణ్యమందెవ
డాత్మ విషయము లోన సందే
హములు వీడి చరి చునో, ఆ
తనికి లోకములెల్ల వశమగు 4.4.41

మనుజ జన్మములోనె ఆత్మను
తెలియ జాలిన మేలు కలుగును
ఆత్మనెరిగిన వారె అమృతులు,
అన్యులేమో శోకభరితులు 4.4.42

బ్రహ్మమెరుగుట కంటె ముందర
తమ్ము తామెరుగంగ వలయును
పిదప ఆత్మలో భూత భవ్యము
లెరుగు వానిని తెలియవలయును 4.4.43

కాలమెవ్వని వెనుక చనునో
వెలుగులకు వెలుగెవ్వడగునో
ఆయువెవడో, అమృతమెవడో.
అతని నే సేవింప వలయును 4.4.44

సర్వ వర్ణములెవనిలోపల
ఉండునో, ఆకాశమెవ్వని
యందు నిలుచునొ, అతనినే వి
ద్వాంసుడందురు, బ్రహ్మమందురు 4.4.45

ప్రాణమునకే ప్రాణమెవ్వడు?
చక్షువునకే చక్షువెవ్వడు?
శ్రోత్రమునకే శ్రోత్రమెవ్వడు?
చిత్తమునకే చిత్తమెవ్వడు? 4.4.46

అతడు సృష్టికి మూల కారణ
మతడు లోకస్థితికి హేతువు
అతని నెరిగిన నరుడు మాత్రమె
బ్రహ్మమును దర్శింపగల్గును 4.4.47

పరమ తత్త్వము నందు నానా
త్వమ్ము లే, దది ఒక్కటే, నా
నాత్వ మెవ్వండున్న దనునో.
అతడు మృత్యువు చేత చిక్కును 4.4.48

అప్రమేయము, ధ్రువము, నానా
త్వమ్ము లేనిది, పుట్టనిది, ఆ
కాశమును మించినది, శాశ్వత
మైనది పరబ్రహ్మ తత్త్వము 4.4.49

ధ్యాన శీలుండాత్మ తత్త్వము
తెలిసి ప్రజ్ఞను పొందవలయును
ఆత్మబోధను మరచి పలికిన
అదియు వాచాలత్వమేయగు 4.4.50

ఆత్మ విజ్ఞానాత్మకమ్మై
ప్రాణములలో మెలగుచుండును
హృదయమందలి యంతరాకా
శమ్ములో వెలుగొందుచుండును 4.4.51

సర్వమును వశపరచుకొనుచును
సర్వమున కధినేతయగుచును
సర్వధనముల కేలికగుచును
సర్వమును పాలించునాత్మయె 4.4.52

మంచి కర్మల చేత పెద్దది
చెడ్డ కర్మల చేత చిన్నది
కాక సర్వావస్థలందున
ఒక్క తీరుగ వెలుగు నాత్మయె 4.4.53

ప్రాణికోటికి నాయకుండై
ప్రాణికోటికి పాలకుండై
ఏక సూత్రము చేత లోకము
లెల్ల కలిపెడి సేతువాత్మయె 4.4.54

వేద వచనమునుసరించీ
యజ్ఞదానము లాచరించీ
తపము నుపవాసమును చేసీ
ఆత్మ తత్త్వము తెలియవలయును 4.4.55

ఆత్మనెరిగియె మౌనులగుదురు
పుత్రకాంక్షకు దూరమగుదురు
ఆత్మలోకము గోరి గృహములు
బాయుచును సంన్యాసులగుదురు 4.4.56

'ఆత్మ లోకము పొందితిమి సం
తానమిక మాకేల' యంటూ
ఏషణ త్రయమును త్యజించియు
భిక్షగొని జీవింతురార్యులు 4.4.57

ఆత్మ ఏషణములకు పరమై
'నేతి' రూపము నందె గననగు,
పుణ్య పాపము లేను జేసితి
నన్న తలపులు మిగుల వక్కటు ! 4.4.58

మంచి చెడ్డల జోలియుండని
దాత్మ తత్త్వము, పుణ్య పాపము
లంటనట్టిది ఆత్మ, బాధా
రహితమైనది ఆత్మ లోకము 4.4.59

ఇట్టి విషయమె బుక్కులందున
చక్కగా వర్ణింపబడినది
కనుక మానుష జన్మమందున
ఆత్మనన్వేషింప వలయును 4.4.60

ఆత్మ నిత్యంబగుట చేతనె
తాను చేసెడి వివిధ కర్మల
వలన బ్రహ్మ జ్ఞాని మహిమలు
తక్కువెక్కువ కాక యుండును 4.4.61

ఆత్మతత్త్వము నెరిగి నపుడే
ఆత్మలో బ్రహ్మాండమంతట
నిండి యుండెడి వానిగాంతుము
కనుక ఆత్మయె వెదుకదగినది 4.4.62

ఆత్మ తత్త్వము తెలిసి సర్వము
చూచు వానిని పాపమంటదు
పాపముల తపియింప జేసెడి
వాడె బ్రహ్మజ్ఞాని యనబడు 4.4.63

ఆత్మలోకమె బ్రహ్మలోకము
బ్రహ్మలోకము పొందుటనగా
ఆత్మలో పరమాత్మ సాక్షా
త్కారమును గావించుకొనుటే 4.4.64

చక్రవర్తీ ! నేడు నిన్నిటు
బ్రహ్మలోకము చేర్చినా'' నని
యాజ్ఞవల్క్యుడు పలుకగా జన
కుండు మిక్కిలి సంతసించెను 4.4.65

తనకు శ్రేష్ఠంబైన ఉపదే
శమ్ము నిచ్చిన కారణమ్మున
రాజు మునికి విదేహ రాజ్యము
తోడ తననర్పించుకొనియెను 4.4.66



# పంచమాధ్యాయం

## 1. పూర్ణబ్రహ్మము

బ్రహ్మమే పరిపూర్ణమైనది
సృష్టియే సంపూర్ణమైనది
పూర్ణమగు బ్రహ్మమ్ము చేతనె
పూర్ణ జగముత్పన్నమైనది 5.1.1.

పూర్ణమగు బ్రహ్మమ్ము చేతనె
పూర్ణ జగముత్పన్నమైనను
పూర్ణమగు బ్రహ్మమ్ము పూర్ణత
కెట్టి కొరతయు కలుగనేరదు 5.1.2

పూర్ణమగు బ్రహ్మమ్ము నామ
త్రయముచే భాసిల్లుచుండును
పరగ 'ఓం' 'ఖం' 'బ్రహ్మ' మనగా
వానిలో 'ఓం' ముఖ్యనామము 5.1.3

బ్రహ్మమునకు పురాణ నామము
'ఖ' మ్మనునదే, కాని కొందరు
వాయుపూర్ణాకాశమందురు
కొందరేమో వేదమందురు 5.1.4

గగనమనగా వ్యాపకుండని
వేదమనగా జ్ఞాన ఖని యని
'ఖం' పదమ్మునకున్న ప్రత్యే
కార్థములు తెలియంగవలయును 5.1.5

## 2. మూడు 'దా' లు

సృష్టి లోపల ప్రజాపతికి ని
స్వీయ గుణకర్మలను బట్టియు
దేవతలు, మానవులు, రాక్షసు
లనగ సంతానమ్ము దనరెను 5.2.1

బ్రహ్మచర్యము చేత కాలము
కొంత గడవగ తండ్రి చెంతకు
ముందుగా దేవతలు పోయిరి
తమకు నుపదేశమ్మునిమ్మని 5.2.2.

తండ్రియప్పుడు 'ద' యను అక్షర
మెలమితో ఉపదేశమిచ్చియు
తెలిసెనా? అని వారినడుగగ
దాని అర్థమునిట్లు చెప్పిరి- 5.2.3

''ఇంద్రియమ్ముల దమన మేర్పడ
జేయుడని ఉపదేశమిచ్చితి''
రనగ తండ్రియు ''మీరు నిజముగ్ర
హించినా'' రని మెచ్చుకొనియెను 5.2.4

అపుడు మానవులా ప్రజాపతి
తోడ మాకుపదేశ మీయం
డనుచు దేవతలెట్లు ప్రార్థన
చేసిరో తామట్లు చేసిరి 5.2.5

తండ్రియప్పుడు 'ద' యను అక్షర
మెలమితో ఉపదేశమిచ్చియు
తెలిసెనా ? అని వారినడుగగ
దాని యర్థమునిట్లు చెప్పిరి- 5.2.6

''మీరు మమ్ముల దాన మొసగుం
డనుచు నుపదేశమ్ము నిచ్చితి''
రనగ తండ్రియు ''మీరు నిజము గ్ర
హించినా''రని మెచ్చుకొనియెను 5.2.7

అపుడు రాక్షసులా ప్రజాపతి
తోడ మాకుపదేశ మీయం
డనుచు మానవులెట్లు ప్రార్థన
చేసిరో తామట్లు చేసిరి 5.2.8

తండ్రియప్పుడు 'ద' యను అక్షర
మెలమితో ఉపదేశమిచ్చియు
తెలిసెనా? అని వారినడుగగ
దాని యర్థమునిట్లు చెప్పిరి 5.2 9

''మీరు మమ్ముల దయ గనుంగొను
డనుచు నుపదేశమ్ము నిచ్చితి''
రనగ, తండ్రియు ''మీరు నిజము గ్ర
హించినా'' రని మెచ్చుకొనియెను 5.2.10

ఆ ప్రజాపతి దేవ మానవ
రాక్షసుల కొరకెట్టి ఉపదే
శమ్ము నొసగెనొ అట్టి దానిని
మేఘసంతతి అనువదించును 5.2.11

మానవాళికి దేవ వాణిని
తెలియ జేయుచునున్న దా అ
న్నట్లు మేఘము లందు గల వి
ద్యుత్తు ద – ద – దా యని ధ్వనించును 5 2.12

దా మృత, దత్త, దయ ధ్వమ్ములు
ఇంద్రియమ్ములనణచు కొనుమను
దాన గుణమును పెంచు కొనుమను
దయను జూపుచు మసలు కొనుమను 5.2.13

మనుజులకు కావలసినట్టి వి
శిష్టమగు శిక్షణము మొత్తము
మూడు 'దా'లలొ ఇమిడి యున్నది
వాని అర్థము తెలియదగినది 5.2.14

నిగ్రహమ్మున దేవతలు, దా
నమున మానవులు, కారుణ్యము
న యసురులు దుర్బలులుగా- కని
పించుచుందురు లోకమందున 5.2.15

కనుకనే ఆ ప్రజాపతి 'దా'
అనగనేమొ తెలిసి తమలో
దుర్బలత్వము వీడవలెనని
పుత్రులకునుపదేశమొసగెను 5.2.16

## 3. హృదయం

దేవ మానవ రాక్షసుల కొర
కెక్కడో స్వర్గాది లోకము
లుండనేరవు, గుణముచే అవి
మూడు విధముల చెప్పనొప్పును 5 3 1

ప్రజాపతియని చెప్పనొప్పును
'హృ' 'ద' 'య' మను మూడక్షరమ్ములు,
దేహమున హృదయమున కెనయగు
వస్తువేదియు కానిపించదు 5.3.2

హృదయమే ఆ ప్రజాపతి, 'హృద
య'మున గల మూడక్షరాలను
అతని ముప్విధమైన సంతా
నమ్ముగా భావింప వలయును 5.3.3

'హృజ్ హరణే' యటంచు తెలిసిన
అందరుపహారములు దెత్తురు
'దదానే' యని తెలిసి యుండిన
అందరుపకారములు సేతురు 5.3.4

'ఇణ్‌గతౌ' అని తెలిసి యుండిన
అందరానందములు గూర్తురు
హృదయము ప్రజా పతిగ తెలిసిన
వానికెంతో సుఖము కలుగును 5.3.5

తీసి కొను పని, ఈయుగల పని
నడువగలపని – మూడు పనులను
'హృదయ'మున మూడక్షరమ్ములు
వరుసగా తెలియంగ జేయును 5.3.6

తీసికొనునది చెడ్డ రక్తము
ఇచ్చునది మరి మంచి రక్తము
ఎప్పుడును పని చేయుచుండుట
ఎరుక లోపలి విషయమే కద! 5.3.7

## 4. సత్యం – బ్రహ్మ

హృదయమందే సత్యమున్నది
సత్యమే ఆ బ్రహ్మమన్నది
ఆదిలో అది ప్రకటమైనది
అందరికి పూజింపదగినది 5.4.1

బ్రహ్మమెరిగిన వాడు మాత్రమె
లోకములు గెలువంగ జాలును
ఉనికి లేనిది యనుచు బ్రహ్మము
నెంచువాడు పరాజితుండగు 5.4.2

## 5. సత్యం – భూర్భువస్వః

సూక్ష్మరూప ప్రకృతి క్రమముగ
స్థూల రూపము నొందినప్పుడు
అంత వరకవ్యక్తమై ఉ
న్నట్టి సత్యము వ్యక్తమైనది 5.5.1

సత్యమవ్యక్తమున – వ్యక్తము
కానిదై అలరారుచుండును
కాని వ్యక్త ప్రకృతి లోపల
వ్యక్తమై కనిపించుచుండును 5.5.2

సత్యము బ్రహ్మమై, ప్రజాపతి
రూపమున ప్రకటమ్ము కాగా
విశ్వ నిర్మాణమ్ము జరిగిన
యటులనే భావింప వలయును 5.5.3

దేవతలు సత్యమును గొలుతురు
సత్యమున గల అక్షర త్రయ
మందు రెండే సస్వరమ్ములు
మధ్యనున్నది అస్వరమ్మగు 5.5.4

'స' 'య' లు రెండును సస్వరమ్ములు
'ద' క్షరమ్మది యస్వరమ్మగు
స్వరము గలిగిన శాశ్వతమ్మగు
స్వరము దొలగిన నాశనమ్మగు 5.5.5

శాశ్వతములగు 'స' 'య' ల మధ్య – అ
సత్యమే బంధింప బడినది
నిత్యులగు పరమాత్మ ఆత్మల
నడుమ లోకము చిక్కినట్లుగ 5.5.6

కాని, కారణ రూపమందు వి
శాల విశ్వము సత్యమేయగు –
ఈ రహస్యము తెలియు వానిని
లోకమెన్నడు బాధపెట్టదు 5.5.7

సత్యమే బ్రహ్మాండమున – ఆ
దిత్య పురుషుని రూపమున, మరి
పిండమున తానక్షి పురుషుని
రూపమున భాసిల్లుచుండును 5.5.8

ఆదిత్య పురుషుండక్షి పురు
షుండనెడి వారలు పరస్పర
మొకరి లోపల మరియునొక్కరు
సుప్రతిష్ఠితులగుచునుందురు 5.5.9

ఆదిత్యుడు స్వకిరణములతో
అక్షి పురుషుని యందు నిలువగ
నాతడును ప్రాణములతో ఆ
దిత్య పురుషుని యందు నిలుచును 5.5.10

అక్షి పురుషుని లోపలను, ఆ
దిత్య పురుషుని లోపలను వెలు
గొందు సత్యము యొక్క సత్తా
ఒక్కటేనని తెలియవలయును 5.5.11

సత్యరూప బ్రహ్మమును ద
ర్శించి తనువును వీడినప్పుడు
శుద్ధమగు తన రూపమున బ్ర
హ్మాండ భానుని చూడనేర్చును 5.5.12

ఊర్ధ్వలోకమ్ములను జేరగ
బోవుచుండెడి వేళ పురుషుని
వెంట సూర్యుని కిరణములు పరి
గెత్తజాలవు, ముక్తుడాతడు 5.5.13

అరయుగా బ్రహ్మాండ మండల
మందు గల ఆదిత్య పురుషుని
శిరము 'భూః' యగు, భుజములేమో
'భువః' యగు, పాదములు 'స్వః' యగు 5.5.14

జ్ఞానమును – ఆదిత్య పురుషుని
దినముగా భావించి కొలిచెడి
వానినెప్పుడు పాపముంటదు
ఆతడే పాపమును చంపును 5.5.15

అరయుగా ఈ దేహమండల
మందు గల ఈ అక్షి పురుషుని
శిరము 'భూః' యగు, భుజములేమో
'భువః' యగు, పాదములు 'స్వః' యగు 5.5.16

అక్షి పురుషుండుపనిషత్ జ్ఞా
నమ్ము తోడనె తెలియబడునని
నిశ్చయమ్ముగ తెలిసి యాతని
గొలుచు వానిని పాపముంటదు 5 5.17

6. మనోమయ పురుషుని స్థానము

మనోమయుడగు విరాట్ పురుషుడు
హృదయ మందున నిలిచియుండును
సత్యరూపుండగుచు నాతడు
సర్వమును శాసించుచుండును 5.6.1

7. విద్యుద్బ్రహ్మ

బ్రహ్మమును విద్యుత్తుగా భా
వించి గొలిచెడి వారి పాపము
లగును దగ్ధము, కనుక విద్యుత్
బ్రహ్మమును ధ్యానింపవలయును 5 7 1

8. వాగ్బ్రహ్మ

వేద వాక్కను ధేనువునకును
నాల్గు స్తనములు గలవు 'స్వాహా'
వషట్, హన్త, స్వధాయనునవి
కనుక వాగ్ధేనువును గొలుతురు 5 8.1
మంత్రముల తుదియందు 'స్వాహా'
'వషట్' శబ్దములుచ్చరించుచు
దేవతల కాహుతుల నిత్తురు
స్తన్యమాస్వాదింతురనగా- 5 8.2
ఇట్టులే మనుజులకు 'హన్త' ప
దమ్ముతోడ, పితరులకు 'స్వధా'
పదము తోడ హవిస్సులిత్తురు
స్తన్యమాస్వాదింతురనగా- 5.8.3
వాణి యనియెడి ధేనువునకును
ప్రాణమే వృషభమ్ము, మనసే
దూడ, వేద జ్ఞాన రూపం
బైన దుగ్ధము గ్రోలవలయును 5.8 4

9. వైశ్వానరుడు

అన్నమును జీర్ణింప జేసెడి
అగ్ని వైశ్వానరుడనంబడు
చెవులు మూసిన యపుడు వినబడు
ధ్వనులు వైశ్వా నరుని వే యగు 5.9.1

కర్మ వశమున జీవుఢీ దే
హమును గాదని పోవునప్పుడు
తనకు వైశ్వానరుని ధ్వనులా
లించుటెంతయు కాదు సులభము 5.9.2

10. మరణానంతర గమనం

దేహమును విడనాడి జీవుడు
సూక్ష్మమగు మార్గమ్ము గుండా
వాయు లోకము, సూర్య లోకము
చంద్ర లోకము చేరు క్రమముగ 5.10.1

చంద్ర లోకము నుండి సూక్ష్మం
బైన మార్గము చేత, శోకము
లేని లోకము చేరి యచ్చట
పెద్ద కాలమ్ముండి పోవును 5.10.2

11. తపస్సు

వ్యాధిచే సంతాపమును పొం
దుటయు తపమే – ఈ రహస్యము
తెలిసి నడిచిన వాడు పర లో
కమును గెలిచిన యట్టివాడగు 5.11.1

శవము కాటికి మోసికొని పో
వుటయు తపమే – ఈ రహస్యము
తెలిసి నడిచిన వాడు పరలో
కమును గెల్చిన యట్టివాడగు 5 11.2

మృత కళేబరమగ్నిలో నుం
చుటయు తపమే – ఈ రహస్యము
తెలిసి నడిచిన వాడు పరలో
కమును గెలిచిన యట్టివాడగు 5.11.3

## 12. అన్న బ్రహ్మ – ప్రాణ బ్రహ్మ

అన్నమును బ్రహ్మమ్ముగా లో
కమ్ములో భావించుచుందురు
కాని అది సరి కాదు, ప్రాణము
లేక అన్నము పాచి పోవును 5.12.1

ప్రాణమును బ్రహ్మమ్ముగా లో
కమ్ములో భావించుచుందురు
కాని అది సరి కాదు, అన్నము
లేక ప్రాణము నీరసించును 5.12.2

ఒక్కటై అన్నమ్ము ప్రాణము
ధ్యేయమును సాధింపగల్గును
కనుక రెండును కలిసి పని చే
యంగ వలెనని పలుకుచుందురు 5.12.3.

ఇట్టి విషయము తెలిసి పాత్రుదు
డెరుగ బలికెను తండ్రితో "ఈ
రెంటినొక్కటి జేయు బ్రహ్మ
జ్ఞాని శ్రేష్ఠుండై వెలుంగును 5.12.4

ఆతనికి మనమెట్టి కీడును
మేలు కూడా సేయజాలము
ఆతడెత్తున నిలుచు" ననుచును
కాని తండ్రికి అది రుచించదు– 5.12.5

''రెంటి నెవ్వండొకటి సేయును?
అన్నమున్నను అన్నమందే
ప్రాణమున్నను ప్రాణమందే
పగలు రేలూ మునిగి తేలును'' 5.12.6

''కాదు తండ్రీ! వీర పురుషులు
రెంటినేకము సేయుచుందురు
అన్నమగు 'వీ' ప్రాణమగు 'ర',
ప్రాణమున నె రమించు ప్రాణులు'' 5.12.7

## 13. ఉక్థ యజుస్సామక్షత్రములు

ప్రాణమే ఉక్థమ్ము, సకలము
ప్రాణమే మేల్కొలుపుచుండును
ప్రాణముననే విత్తు భూమిని
పగులగొట్టుచు పుట్టుచుండును 5.13.1

ప్రాణ వేగము తోడనే ఏ
ప్రాణి యైనను తల్లిగర్భము
నుండి బయటికి వచ్చుచుండుట
లోకమందున చూచుచుందుము 5.13.2

ఈ రహస్యంబెరుగు వానికి
ఉక్థ వేత్తగు వీర పుత్రుడు
కలుగ నేర్చును, స్వయముగా తా
నుక్థ సాయుజ్యతను పొందును 5.13.3

ప్రాణమే యజుస్సు, దానిచే
ప్రాణులెల్లను యుక్తమైనవి
– ఈ రహస్యంబెరుగు వానికి
ప్రాణికోటి శుభంబులిచ్చును 5.13.4

ప్రాణమే సామమ్ము, సామము
లోనె భగాతము లిమిడి ఉన్నవి
– ఈ రహస్యంబెరుగు వానికి
ప్రాణులెల్ల సుఖమ్ము గూర్చును 5.13.5

ప్రాణమే క్షత్రమ్ము, ప్రాణము
దేహమును క్షతి నుంచి గాచును
– ఈ రహస్యంబెరుగు వానిని
శక్తి సంపదలాశ్రయించును 5.13.6

ప్రాణమును గుర్తించు మనుజుం
డితర సాయము గోర నేరడు
స్వయముగానే క్షత్ర సాయు
జ్యమ్ము నాతడు పొంద గలుగును 5.13.7

## 14. గాయత్రి

మంత్రమన గాయత్రి , అందలి
[1] ప్రథమ పాదము నుచ్చరించుచు
మూడు లోకాలను స్మరించిన
పొంద దగినది పొంద వచ్చును 5.14.1

వేడ్క తోడ [2] ద్వితీయ పాదము
లోని వర్ణములుచ్చరించుచు
త్రయీ విద్యను సంస్మరించిన
పొంద దగినది పొంద వచ్చును 5.14.2

---

*1.* గాయత్రి ప్రథమ పాదంలోని అక్షరాలు ఎనిమిది : తత్, స, వి, తుర్, వ, రే, ణి, యమ్; మూడు లోకాలలోని అక్షరాలు ఎనిమిది . భూమి, అంతరిక్షమ్, ద్యౌః
*2* ద్వితీయ పాదంలోని అక్షరాలు ఎనిమిది : భర్గో దేవస్య ధీమహి; త్రయీ విద్యలోని అక్షరాలు ఎనిమిది : ఋచః, యజూంషి, సామాని

ప్రేమతోడ [3]తృతీయ పాదము
లోని వర్ణములుచ్చరించుచు
మూడు ప్రాణములను జపించిన
పొంద దగినది పొంద వచ్చును 5.14.3

'తురీయ' 'దర్శత' 'పరోరజా'
మంత్ర రాజంబైన గాయ
త్రికిని నాల్గవ పాదమనబడు
'తురీయ'మ్మనగా నాల్గవది 5.14.4

'దర్శత' యన కనబడుచున్న
ట్లుండునట్టిది, ప్రకృతి కంటె ప
రమున నుండునది 'పరోరజా' -
అంతటను తపియించునట్టిది 5.14.5

ఈ చతుర్థ పదమ్ము చేతనె
విశ్వమంతయు గొప్ప తపమున
లీనమగునని తెలియ గల్గిన
కీర్తి సంపద లందవచ్చును 5.14.6

ఈ చతుర్థ పదమ్ము గనుగొన
సత్యమందు ప్రతిష్ఠితమ్మై
అలరుచున్నది, చక్షువే ఆ
సత్యమై వెలుగొందుచున్నది 5.14.7

---

*3. తృతీయ పాదంలోని అక్షరాలు ఎనిమిది : ధియో యోనః ప్రచోదయాత్; మూడు ప్రాణాలలోని అక్షరాలు ఎనిమిది : ప్రాణః, అపానః, వ్యానః (వి+ ఆనః)*

నేను వింటిని, నేను గంటిని-
అనుచు నిద్దరు వచ్చి చెప్పిన
కంటినని వచియించు వానిని
విశ్వసింతుము విశ్వమందున 5.14.8

గొప్పనగు గాయత్రి నాల్గవ
పాదమీ విశ్వమ్ము లోఈ
శ్వరుని దర్శత పదము నెంతయు
స్మృతికి తెచ్చినయట్లు కన్పడు 5.14.9

'దర్శత' యె గాయత్రి నాల్గవ
పదము, సత్యబలమ్ము నందే
సుప్రతిష్ఠితమగుచు సత్య ప
దమ్మ నిత్యము వెలుగుచున్నది 5.14.10

సత్యమున నెలకొన్న బలమును
భౌతికమ్మని చెప్పకూడదు
సత్యమున నెలకొన్న బలమును
ప్రాణమని వచియింపవలయును 5.14.11

దేహమున గల ప్రాణములనే
పిలుతురార్యులు గయ యటంచును
ప్రాణముల రక్షించు మంత్రం
బగుటచే గాయత్రి యనబడు 5.14.12

ఐదు ప్రాణములైదు నింద్రియ
ములకు సంయమనమ్ము కలుగగ
జేయునది గాయత్రి, దానిని
పండితులు సావిత్రి యందురు 5.14.13

గురువు మంత్రార్థమ్ము చెప్పుచు
ఉపనయన సంస్కారమందున
శిష్యునకు గాయత్రి మంత్రము
ప్రేమతో ఉపదేశమొసగును 5.14.14

లోకమున గాయత్రి నుపదే
శించెనన ఆచార్య వర్యుడు
బ్రహ్మచారికి ప్రాణరక్షణ
చేసినట్లుగ తలపవలయును 5.14.15

కొందరేమో నాల్గు పాద
మ్ములు అనుష్టుప్ ఛందమున రచి
యింపబడు సావిత్రి నుపదే
శింపవలెనని చెప్పుచుందురు 5.14.16

కాని, ఆచార్యుండు తప్పక
మూడు పాదములందుగల గా
యత్రినే సావిత్రిగా ఉప
దేశమును గావింప వలయును 5.14.17

ప్రేమతో గాయత్రి నుపదే
శించు పండితులెంత దక్షిణ
స్వీకరించిన మంత్ర పాదము
తో సమానము కాక యుండును 5.14.18

మూడు లోకము లెవరికైనను
దొరికినను అవి నిజముగా గా
యత్రిలో గల మొదటి పాదము
పొందినంతటి విలువసేయును 5.14.19

ఆ త్రయీ విద్యేవరి కైనను
దొరికినను అది నిజముగా గా
యత్రిలోని ద్వితీయ పాదము
పొందినంతటి విలువ సేయును 5.14.20

ప్రాణికోటిని తన వశమ్మున
నిలిపినను అది నిజముగా గా
యత్రిలోని తృతీయ పాదము
పొందినంతటి విలువ సేయును 5.14.21

కాని ఆ గాయత్రి నాల్గవ
పాదమై భాసిల్లు దర్శత
తురీయ పరోరజా కెనమై
నిలవగల్గినదేది యుండదు 5.14.22

''దివ్యమగు గాయత్రి! నీ ప్ర
ప్రథమ పాదము త్రయీలోక్యము
రెండు – వేద త్రయము కాగా
మూడు – ప్రాణ త్రయము సుమ్మీ 5.14 23

సర్వమును వెలిగింపజేసెడి
దర్శత పరోరజా రూపము
నీ చతుర్థంబైన పాదము
దానికిని నా నమస్కారము 5.14.24

ఇన్ని పాదములుండి కూడా
పాదములు లేనట్టిదానవు
ఈ రహస్యము తెలియకుండిన
తెలియబడకనె ఉండు దానవు 5.14.25

నిన్నెరింగిన వారలను ద్వే
షించు వారికి నీదు పాదము
దొరకకుండును, మరియు వారల
కోర్కెలేవి ఫలింపకుండును 5.14.26

దివ్య గాయత్రీ రహస్యము
తెలిసి ప్రార్థన సేయు వారల
కోరికలు సిద్ధించుచుండును
శత్రువులు నిర్జింపబడుదురు 5.14.27

జనకుడశ్వతరాశ్వ సుతుడగు
బుడిలు నిందిలకించి యిట్లనె
''నిన్ను గాయత్రీ విదునిగా
ఎల్లవేళల చెప్పుకొందువు 5.14.28

కాని, ఏనుగు బరువు మోసెడి
విధముగా సంసార భారము
మోయుచుంటివి, కష్టపడుటకు
కారణమ్మును చెప్పగలవా?'' 5.14.29

''చక్రవర్తీ మీరు చెప్పిన
మాట నిజమే, నేను గాయ
త్రిని పఠింతును గాని దానికి
గల రహస్యము నెరుగజాలను'' 5.14.30

''అగ్ని గాయత్రికి ముఖమ్మగు-
ఎవడు దానిని గూర్చి మననము
సేయునో అతడీ జగమ్మున
అగ్ని ముఖుడై వెలుగ నేర్చును 5.14.31

అగ్ని లోపల ఏది వేసిన
అదియు భస్మంబైన విధమున
మంత్రముఖుడగు వాని పాపము
లెల్ల భస్మంబగుట తథ్యము 5.14.32

ఎవడు గాయత్రీ ముఖుండై
వెలుగునో, పాపములనాతం
డగ్ని వలె భుజియించి శుద్ధుం
డగుచునమరుండై వెలుంగును 5.14.33

## 15. ఈశోపనిషత్తు మంత్రార్థము

మూయబడినది నేడు బంగరు
ముంతచే సత్యమ్ము సాధక!
సత్యమును దర్శింపదలచిన
ముంతనే తొలగింపవలయును 5 15.1

ఓ ప్రచండ నియంత! లోక
మ్ములకు పుష్టినొసంగు దేవా!
ఓ అఖండ ప్రకాశమాన!
నీ కిరణములె అంతటున్నవి 5.15 2

స్వామి! అంతట నిండు నీ కిర
ణమ్ములను తొలగింపవయ్యా!
నీ కిరణములు గాక నీ క
ళ్యాణ కరమగు రూపుగాంచెద 5.15.3

పరమ పురుషుని రూపమెంతో
అద్భుతమ్మగు, దివ్యమగు, తే
జోమయమ్మగు, నేను కూడా
అట్టి జోతిర్మయుడనే కద! 5.15.4

ధర్మకార్యములను ఘటించుము
తలచు మోంకార స్వరూపుని,
పూర్వకర్మలతో భవిష్యత్
కర్మలను స్మరియించు మెప్పుడు 5.15.5

ఆత్మ వెడలిన పిదప దేహ
మ్మగ్నికాహుతి యగుట తప్పదు
తనువు భస్మమ్మైన పిమ్మట
చేయు సంస్కారమ్ములుండవు 5.15.6

మనిషి జీవిత కాలమంతయు
మంచి పనులే సేయవలయును
పరమ పురుషుని ముఖ్యనామము
ప్రణవమును జపియింపవలయును 5.15.7

ఎట్టి కర్మలు చేసినను ని
ష్ఫలము కావని తలపవలయును
ధర్మమును పాటించి, ధర్మము
కాని దానిని విడువవలయును 5.15.8

స్వయంజ్యోతీ! నీవు మాత్రమె
సర్వధర్మములెరుగు వాడవు
మమ్ము సన్మార్గమున నడుపుచు
కుటిల మార్గము నుండి కావుము 5.15.9

కోరుదుము విజ్ఞాన ధనమును
దానిచే ఒడగూడు సుఖమును
నీకు లెస్స నమస్కరింతుము
కరుణ జూడుము దేవదేవా! 5.15.10

# షష్ఠాధ్యాయం

## 1. ప్రాణేంద్రియ వివాదం

ఎవడు జ్యేష్ఠము నెరుగగలడో
వాడు జ్యేష్ఠుండై వెలుంగును
ఎవడు శ్రేష్ఠము నెరుగగలడో
వాడు శ్రేష్ఠుండై వెలుంగును 6.1.1

దేహమున గల ఇంద్రియమ్ముల
కంటె ప్రాణమె జ్యేష్ఠమైనది
దేహమున గల ఇంద్రియమ్ముల
కంటె ప్రాణమె శ్రేష్ఠమైనది 6.1 2

జ్యేష్ఠమగు ప్రాణమ్మునెరిగిన
వాడె అందరిలోన జ్యేష్ఠుడు
శ్రేష్ఠమగు ప్రాణమ్ము నెరిగిన
వాడె అందరిలోన శ్రేష్ఠుడు 6.1.3

వాగ్వసిష్ఠము, దానినెరిగిన
వాడె అందరిలో వసిష్ఠుడు
చతుర భాషణ సేయువానిని
చూచి లోకము మెచ్చకుండునె? 6.1.4

లోకమందు ప్రతిష్ఠ నేత్రము,
దానినెరిగిన మనుజుడీ లో
కమున పరలోకమున లెస్స ప్ర
తిష్ఠితుండై ముదము గూర్చును 6.1.5

ఇంద్రియమ్ముల కాలవాల
మ్మైన మనసే ఆయతనమగు,
నెవ్వడాయతనమ్ము నెరుగునో
అతడు మిత్రుల కాశ్రయుండగు 6.1.7

సృష్టి జరిగిన పిదప ప్రాణేం
ద్రియములందున నేను గొప్పొ?
నీవు గొప్పొ? యను వివాదము
సంభవించిన దొక్క రోజున- 6.1.8

వెంటనే అవి జగత్ పితయగు
ఆ ప్రజాపతి జేరి ''మాలో
శ్రేష్ఠుడెవడో చెప్పవలెనని
అడుగగా నతడిట్లులనియెను- 6.1.9

''ఎవడు మీలో దేహమును విడ
నాడి పోయిన దేహమంతయు
నిరుపయోగము, ఘృణితమగునో
అతడు శ్రేష్ఠం'' డనుచు చెప్పెను 6.1.10

ఆ ప్రజాపతి మాటలను విని
వాణి తనువును విడిచిపెట్టియు
నెక్కడో ఒక ఏడు గడిపియు
తిరిగి వచ్చెను దేహమునకును 6.1.11

తనకు తోడుగ నిలిచి తనువును
నడుపు ఇంద్రియములను గాంచుచు
'నేను లేకను మీరలే గతి
బ్రతికినారో చెప్పు' డనియెను 6.1.12

''మూగవానికి మాటలుండవు
కాని ప్రాణముతోడ బ్రతుకును
నేత్రములతో చూడగలుగును
చెవులతో ఆలింపగలుగును 6.1.13

మనసుతో యోచింపగల్గును
కనుక నీవిటులేకపోయిన
నేమి ? మేమిటు బ్రతికియున్నా
మనగ తనువును చేరె వాణియు 6.1.14

వాణి యట్టుల తనువు జేరగ
కన్ను తనువును విడిచిపెట్టిన
దగుచు, ఒక ఏడెక్కడో తా
నుండి తనువును జేరవచ్చెను 6.1.15

తనకు తోడుగ నుండి తనువును
నడుపు ఇంద్రియములను గాంచుచు
'నేను లేకను మీరలే గతి
బ్రతికియుంటిరొ చెప్పుడనియెను 6.1.16

''నేత్రహీనుడు చూడజాలడు
కాని ప్రాణము తోడ బ్రతుకును
వాణితో మాట్లాడగలుగును
చెవులతో ఆలింపగలుగును 6.1.17

మనసుతో యోచింపగల్గును
కనుక నీవిటు లేకపోయిన
నేమి? మేమిటు బ్రతికియున్నా
మనగ తనువును జేరె నేత్రము 6.1.18

కన్ను తనువును జేరగానే
దేహమును విడనాడి శ్రోత్రము
వత్సరమ్మగు కాలమెటనో
గడిపి పిమ్మట చేర వచ్చెను 6.1.19

తనకు తోడుగ నుండి తనువును
నడుపు ఇంద్రియములను గాంచుచు
'నేను లేకను మీరలే గతి
బ్రతికియుంటిరొ చెప్పు' డనియెను 6.1.20

శ్రవణ హీనుడు వినగ జాలడు
కాని ప్రాణము తోడ బ్రతుకును
వాణితో మాట్లాడగలుగును
కంటితో తిలకింపగలుగును 6.1.21

మనసుతో యోచింపగల్గును
కనుక నీవిటు లేకపోయిన
నేమి ? మేమిటు బ్రతికియున్నా
మనగ తనువునుజేరె శ్రోత్రము 6.1.22

అటుల శ్రోత్రము తనువు జేరగ
మనసు దేహము నుండి వేరై
వత్సరమ్మగు కాలమెటనో
గడిపి పిమ్మట చేరవచ్చెను 6.1.23

తనకు తోడుగ నుండి పనులను
చేయు ఇంద్రియములను గాంచుచు
'నన్ను విడిచియు మీరలే గతి
బ్రతికినారో చెప్పు' డనియెను 6.1.24

''మనసు నెరుగగ లేని బాలకు
లెట్లు చూచుచు, వినుచు, మాటలు
చెప్పుచును జీవింతురో, మే
మటులనే జీవించుచుంటిమి''  6.1.25

మనసు కూడా అధికురాలను
కాను నేనని తెలిసి తనువున
చేరిపోయిన జూచి ప్రాణము
వెలుపలికి వెడలంగ బూనెను  6.1.26

బలము గల గుఱ్ఱమ్ము పద బం
ధములతో తన మేకులూడగ
పెరికికొని పరిగెత్తినట్లుగ
నింద్రియములను లాగుచుండెను  6.1.27

అప్పుడింద్రియములు సమస్తము
తల్లడిల్లుచు ప్రాణమును గని
''ఇచటనే వర్థిల్లు, శ్రేష్ఠుడ
వీవె పోవల'' దనుచు వేడెను  6.1.28

ప్రాణమన్నిటికంటె శ్రేష్ఠం
బగుటచే ఆనాటినుండియు
ఇంద్రియమ్ములు ప్రాణనామము
తోడ వ్యవహృతమగుచునుండెను  6 1.29

ప్రాణమే శ్రేష్ఠమ్ము, జ్యేష్ఠము
ప్రాణమే మహనీయ సంపద
లోకమందు ప్రతిష్ఠ ప్రాణమె
ప్రాణమే ఆయతనమన్నియు  6.1.30

ప్రాణమింద్రియములనుగని 'నా
కన్నమే' దని యడుగ ''కుక్కలు
మొదలు పక్షుల వరకు ప్రాణుల
అన్నమే నీకన్న'' మన్నవి 6.1.31

ప్రాణమింద్రియములను గని 'నా
వస్త్రమేదని యడుగ ''అన్నము
తినెడి యప్పుడు ముందు వెనుకల
త్రాగు జలమే వస్త్ర'' మన్నవి 6.1.32

లోకమున సాధారణముగా
అన్నమును వస్త్రమ్ముచే క
ప్పంగ జూసెడి మనుజుడెన్నడు
నగ్నుడై చరియింపకుండును 6.1.33

సత్యకాముండట్లు గోశ్రుతి
కెంతయును బోధించి, ''యిక్కథ
చెప్పగా విని మోడు సైతము
చిగురు వేయు'' నటంచు తెలిపెను 6.1.34

★ ★ ★

## 2.శ్వేతకేతువు - జై బలిపుత్రుని ఐదు ప్రశ్నలు

శ్వేత కేతువు వేడ్కతో ఒక
నాడుపాంచాలమున కేగగ
రాజ సభలో చూచి జై బలి
రాజ పుత్రుండతనికిట్లనె 6.2.1

''నీదుజనకునితోడ ధార్మిక
శిక్షణమ్మును పొందినావా''
ఉత్తరమ్ముగ శ్వేత కేతువు
''నేను పొందితి'' నని వచించెను 6.2.2

''మనిషి మృత్యువునొంది యెచ్చటి
కేగునో మరి చెప్పగలవా ?''
''ఇదియు నెంతయు నాకుతెలియ''ద
టంచు పలికెను శ్వేత కేతువు 6.2.3

''తిరిగి దేహములోని కే గతి
వచ్చునో వచియింపగలవా ?''
''ఎంతమాత్రము తెలియదిది''యని
శ్వేతకేతువు బదులు పలికెను 6.2.4

''దేవయానము పితృయానము
రెండువేరగు చోటుతెలుపుము''
''స్వామినాకిది యెంతమాత్రము
తెలియ'' ననియెను శ్వేతకేతువు 6.2.5

''ఎందరును మరణించినను లో
కమ్ము నిండదదేల చెపుమా?''
''ప్రభువు నాకిది యెంత మాత్రము
తెలియ దనియెను శ్వేతకేతువు 6.2.6

''పంచమాహుతి జలము పురుషుం
డెట్టులై మాట్లాడు చెపుమా ?''
''దేవ! నాకిది యెంత మాత్రము
తెలియ'' దనియెను శ్వేతకేతువు 6.2.7

అపుడు జైబలి పుత్రుడైనప్ర
వాహణుండాశ్చర్యమొందుచు
''విషయ మెరుగక శిక్షణము పొం
దితినటంచును పలుకదగునే ?'' 6.2.8

అనుచు మెత్తగ మందలించిన
శ్వేతకేతువు తండ్రి సన్నిధి
కేగి ''పూర్తిగ శిక్షణివ్వక
అంత నేర్పితిననుట తగునా? 6.2.9

జైబలీ పుత్రుండు నన్నటు
లైదుప్రశ్నలు వేసినప్పుడు
ఒక్కదానికీ నే జవాబును
చెప్పజాలకపోయి నాడను'' 6.2.10

అనగ నాతని తండ్రి సిగ్గిలి,
యాతడడిగిన వాటిలోనొక
దానికైన జవాబు పూర్తిగ
తెలియదనుచు నిజమ్ము పలికెను 6.2.11

కాని తనలో తెలియవలెనను
కోర్కెమీరగ శ్వేతకేతుని
తండ్రి గౌతముడరిగె జైబలి
రాజు చెంతకు ఆలసింపక 6.2.12

మనివరుండగు గౌతముని గని
రాజు సత్కారమ్ము చేసెను
వలయు విత్తము కోరుకొమ్మని
ప్రియముగా మాట్లాడ సాగెను 6.2.13

కాని, గౌతముడతనితో ''నా
కొడుకు నడిగిన ప్రశ్నలకు నీ
వే సమాధానమ్ము ని'' మ్మని
యతని నెంతయు వేడు కొనియెను 6.2.14

అంత జైబలి గౌతముని తన
నగరమందొక కొంత కాల
మ్ముండునట్లుగ జేసి ఆపై
అతనికిట్లుపదేశమిచ్చెను 6.2.15

''చూడు గౌతమ! నీవు నన్నీ
ప్రశ్నలకు జవాబునడిగితివి
కాని యింతకు పూర్వమెవ్వరు
నంతగా ఈ విద్య నెరుగరు 6.2.16

ఇంతకంటెను పూర్వమే బ్రా
హ్మణుడు దీనిని తెలియజాలడు
కనుకనే క్షత్రియుల శాసన
మన్ని దేశములందు చూతుము 6.2.17

ఐదు ప్రశ్నల నడిగినాడవు
కాని వానిలొ మొదట ఐదవ
ప్రశ్నకేను జవాబు నిచ్చెద
శ్రద్ధతో ఆలించవయ్యా! 6.2.18

గౌతమా! కనిపించునట్టిద్యు
లోకమే యజ్ఞాగ్ని, సూర్యుడు
దాని యందలి సమిధ, కిరణము
లేమొ ధూమమ్మగుచు నొప్పును 6.2.19

మరియు దివసము జ్వాలయ్యై రా
జిల్లుచుండగ, చంద్రుడేమో
నిప్పు కణమై, చుక్కలేమో
నిప్పురవలై అలరుచుండును 6.2.20

అంతరిక్షంబనెడి అనలము
నందు దేవతలాహుతిత్తురు
జలము, తత్కారణము చేతనె
సోముడావిరిగా జనించును 6.2.21

సృష్టిలోని ద్యులోక రూపం
బైన యజ్ఞము నందు దేవత
లొసగుచుండు జలాహుతిని ప్ర
ప్రథమమగు ఆహుతిగ నెంచుము 6.2 22

గౌతమా! కనిపించు ఈ ప
ర్జన్యమే యజ్ఞాగ్ని, వాయువు
దాని లోపలి సమిధ, అభ్రము
ధూమమై అలరారుచుండును 6.2.23

జ్వాలయై విద్యుత్తు కన్పడ
పిడుగులేమో నిప్పు కణములు,
ఉరుములేమో నిప్పురవ్వలు
గాగనెంతయు నొప్పుచుండును 6.2.24

మేఘ రూపంబైన అనలము
నందు దేవతలాహుతిత్తురు
సోమరూపంబైన బాష్పము,
దానిచే వర్షమ్ము కురియును 6.2.25

సృష్టిలోపలి మేఘ రూపం
బైన యజ్ఞము నందు దేవత
లొసగుచుండు జలాహుతిని రెం
డవది యగు ఆహుతిగ నెంచుము 6.2.26

గౌతమా! కనిపించు ఈ భూ
లోకమే యజ్ఞాగ్నియగు, సం
వత్సరమ్మే సమిధ, ఆకా
శమ్ము ధూమమ్మగుచు నొప్పును 6.2.27

రాత్రి – జ్వాలై అలరుచుండగ
దిక్కులేమో నిప్పుకణములు
చుక్కలేమో నిప్పురవ్వలు
గాగనెంతయు నొప్పుచుండును 6.2.28

పృధ్వి రూపంబైన అనలము
నందు దేవతలొసగు వర్షం
బనెడి ఆహుతి చేత అన్నము
లోకమున ప్రభవించుచుండును 6.2.29

స్పష్టి లోపలి పృథ్వి రూపం
బైన అనలము నందు దేవత
లొసగుచుండు జలాహుతిని మూ
డవది యగు ఆహుతిగ నెంచుము 6.2.30

గౌతమా! కనుగొంటివేనియు
పురుషుడే యజ్ఞాగ్ని, వాణియె
అందు లోపలి సమిధ, ప్రాణము
ధూమమై అలరారుచుండును 6.2.31

జిహ్వ-జ్వాలై ఒప్పుచుండగ
కన్నులేమో నిప్పుకణములు
కర్ణములు మరి నిప్పురవ్వలు
గాగ నెంతయు నలరుచుండును 6.2.32

పురుష రూపంబైన అనలము
నందు దేవతలొసగు అన్నం
బనెడి ఆహుతి చేత వీర్యము
క్రమముగా వర్ధిల్లుచున్నది 6.2.33

స్పష్టి లోపలి పురుష రూపం
బైన అనలము నందు దేవత
లొసగుచుండు జలాహుతిని నా
ల్గవది యగు ఆహుతిగ నెంచుము 6.2.34

గౌతమా! కనుగొంటివేనియు
సాధ్వియే యజ్ఞాగ్ని, ఆమె ఉ
పస్థయేమో సమిధ, సంబం
ధమ్ము ధూమమ్మగుచు నొప్పును 6.2.35

యోని- జ్వాలై అలరుచుండగ
దేవతలు స్త్రీ రూపమగు య
జ్ఞాగ్నిలో రేతస్సు నాహుతి
చేతురేనియు గర్భమేర్పడు 6.2.36

సృష్టిలోపలి ఉవిద రూపం
బైన అనలము నందు దేవత
లొసగుచుండు జలాహుతిని ఐ
దవది యగు ఆహుతిగ నెంచుము 6.2.37

పంచమాహుతి యందు జలమటు
పురుషుడై మాట్లాడగల్గును
మాతృగర్భము లోన తొమ్మిది
లేక పది నెలలుండి పుట్టును 6.2.38

ఆయువెంతో, అంత కాలము
బ్రతికి, మృత్యువు దాడి సేయగ
అగ్నిచే మరియొక్క చోటికి
తీసికొని పోబడును పురుషుడు 6.2.39

ఈ ద్యులోక పయోధరమ్ములు,
అన్న వీర్యము, లతివ గర్భము
లనునవే పంచాగ్ను, లవియే
దేహధారణ కారణమ్ములు 6.2.40

దేవతలు సమకూర్చు ఆహుతి
ఐదు అగ్నుల కారణమ్మున
పురుష రూపము దాల్చుచుండును
పుడమిపై కాల్మోపుచుండును 6.2.41

పురుష దేహోత్పత్తి క్రమమును
తెలిసికొని నిష్కామ కర్మలు
సత్యమునుపాసించు వారై
దేవ యానమునందు పోదురు 6.2.42

యోగ మార్గము చేత తనువును
విడిచిపెట్టిన వారు కావున
సూర్యరశ్మిని బోలి వారల
రూపమెంతో కాంతిమయమగు 6.2.43

క్రమముగా వారుత్తరాయణ
కాలమందలి కాంతిగొనుచును
అంతకంటెను గొప్పదగు సం
వత్సరంబగు జ్యోతిగాంతురు 6.2.44

అంతకంటె విశేషమగు ఆ
దిత్య కాంతిని పొంది క్రమముగ
చంద్ర కాంతిని మరియు విద్యుత్
కాంతినెంతయు పొందుచుందురు 6.2.45

అంతకంతకు నధిక కాంతిని
పొందు పురుషుడె బ్రహ్మవిదులకు
బ్రహ్మమార్గము జూపుచుండును
దేవయానంబనగ నదియే 6.2.46

దానధర్మములాచరించుచు
సుఖములా కాంక్షించు వారలు
పితృయానము నందు సాగుచు
భిన్నయోనుల బుట్టుచుందురు 6.2.47

మృత్యు ముఖమున అడుగు మోపిన
యంతలోనే బాధ మొదలై
కాంతి హీనములైన వస్తువు
లాశ్రయింపగ వలసి వచ్చును 6.2.48

క్రమముగా ధూమమ్ము, రాత్రము,
కృష్ణపక్షము చేరి పిమ్మట
దక్షిణాయనమందు పితృ లో
కమ్ము చేరి వసించుచుందురు 6.2.49

పితృలోకము నుండి క్రమముగ
చంద్ర లోకము చేరుచుందురు
చంద్ర లోకము దేవతాళికి
అన్నమై అలరారుచుండును 6.2.50

చంద్ర లోకములో సకాములు
కర్మ ఫలముల ననుభవించియు
తిరిగి వచ్చిన మార్గముననే
భూమి మీదికి చేరుచుందురు 6.2.51

క్రమముగా ఆకాశ రూపము
నుండి వాయువు, వాయు రూపము
నుండి మేఘము, మేఘరూపము
నుండి పృథ్విని చేరుచుందురు 6.2.52

పృథ్విపై ఓషధుల రూపము
వడ్ల రూపము, తిలల రూపము,
ఇంకను వనస్పతుల రూపము
పొందుచుందురు జీవులెంతయు 6.2.53

కర్మ ఫలములననుసరించియె
భూమిపై గల ధాన్యములలో
చిక్కి పశ్వాదులకు భోజ్యము
లగుచు ప్రభవము నొందుచుందురు 6.2.54

పసుల వీర్యము వలన పశువులు
జనుల వీర్యము వలన జనులును
పుట్టుచుందురు, కాని దీనికి
భిన్న సృష్టిని గానకుందుము 6.2.55

చంద్రలోకము నుండి మరలిన
వారలంతకు ముందు పుణ్యము
లాచరించిన మంచి జన్మలు
పొందుటకు నవకాశముండును 6.2.56

పాప కృత్యము లాచరించియె
చంద్రలోకము చేరగల్గిన
తిరిగి వారలు శునక సూకర
దేహములతో నుద్భవింతురు 6.2.57

మొదట జై బలిరాజు గౌతమ
మునికి ఐదవ ప్రశ్న కుత్తర
మిచ్చి తదుపరి మొదటి ప్రశ్నకు
చెప్పినాడు జవాబు నిట్టుల – 6.2.58

కర్మ ఫలముల కంటువడకయు
నుత్తరాయణమందు మనుజులు
దేవయానము తోడ ముక్తిని
పొందనేర్పుట 'పారగతి'యగు 6.2.59

కర్మ ఫలముల కంటువడుచును
దక్షిణాయన మందు మనుజులు
పితృ యానముతోడ సోముని
లోకమేగిన 'చాంద్రమసిగతి' 6.2.60

అనుచు రెండవ ప్రశ్నకుత్తర
మిట్లొసంగెను ''కర్మ ఫలములు
కోరకుండిన బ్రహ్మలోకము
గాంచి జ్యోతిర్మయులునగుదురు 6.2.61

కాని ఫలములు కోరిరేనియు
చంద్రలోకము చేరి అభ్రము
నుండి పృథ్వికి చేరి పుణ్యా
పుణ్య జన్మము లొందుచుందురు'' 6.2.62

అనుచు మూడవ ప్రశ్నకిట్లు జ
వాబొసంగెను ''దేవయానము
నందు వెడలెడి వారలయనము
నుండి సంవత్సరము గాంతురు 6.2.63

కాని పితృయానమ్ము తోడను
పోవువారయనమ్ము నుండియు
వత్సరమ్మున కేగజాలక
పితృలోకము చేరుచుందురు 6.2.64

దేవయానము పితృయానము
లిట్టులయనము చేత వేరై
జీవులకు కర్మాను కూలం
బైన ఫలములనొసగుచున్నవి 6.2.65

ఇంక నాల్గవ ప్రశ్నకుత్తర
మిచ్చుచుంటిని ''దేవయానము
పితృయానము మార్గములలో
పోవ జాలని వారలుందురు 6.2.66

వారు కీటపతంగ జన్మము
లెత్తు చుందురు, చచ్చుచుందురు
కనుకనే ఈ లోకమెప్పుడు
నిండదని భావింపవలయును 6.2.67

3. మన్థరహస్యం

గొప్ప మహిమలు కోరుకొను వా
రుత్తరాయణ శుక్లపక్షము
నందు ద్వాదశ దినములుపసద్
వ్రతములో గడపంగ వలయును 6.3.1

మేడిపాత్రను లేక వేరొక
కంచు పాత్రను సిద్ధపరిచియు
నందులో సర్వౌషధమ్ములు
వివిధ ఫలములు నుంచవలయును 6.3.2

యజ్ఞభూమిని శుభ్రపరిచియు
బాగుగా అలుకంగ వలయును
నాల్గుదిశలకుశాసనమ్ములు
కూర్చొనుటకై వేయవలయును 6.3.3

అగ్నినాధానమ్ము చేసియు
సిద్ధపరిచిన మంథమును గొని
ప్రార్థనా మంత్రములతోడ ఘృ
తాహుతులనీయంగవలయును 6.3.4

జాతవేదుని – ''ప్రకృతి శక్తులు
తృప్తిపడి కామనలు దీర్పగ
అగ్నిముఖమున వాని భాగము
లిత్తు''నని ప్రార్థింపవలయును 6.3.5

శక్తి యెయ్యది తనకు భిన్నం
బగుచు గర్వము చూపుచున్న దో
దాని నే ఘృతధారతో పూ
జింతునని ప్రార్థింపవలయును 6.3.6

తనకు ప్రతికూలమ్ముగా నిల
బడిన దేవతలెల్ల శుభములు
గూర్పవలెనని ఆహుతులతో
యజ్ఞపురుషుని కోరవలయును 6.3.7

జ్యేష్ఠమగుచును, శ్రేష్ఠమగుచును
ప్రాణమొప్పుచు నుండు కనుకనె
'మంథ' లోపల ప్రాణభావన
చేసి ఆహుతులీయవలయును 6.3.8

''జ్యేష్ఠాయస్వాహా, శ్రేష్ఠా
య స్వాహా, ప్రాణాయ స్వా
హా'' అని వేద మంత్రములతో
ఆహుతుల నీయంగ వలయును 6.3.9

అటులె 'వసిష్ఠాయ స్వాహా'
యనుచు 'వాచే స్వాహా' యనుచు
'ప్రతిష్ఠాయై స్వాహా' యనుచు
ఆహుతుల నీయంగ వలయును 6.3.10

'చక్షుషే స్వాహా' యనుచు 'సం
పదే స్వాహా' యనుచు 'శ్రోత్రా
యస్వాహా' యనుచు ఘృతముతో
ఆహుతులనీయంగ వలయును 6.3.11

'ఆయతనాయ స్వాహా' 'మన
సే స్వాహా' యనుచు 'ప్రజాత్యై
స్వాహా' 'రేతసే స్వాహా' య
టంచు ఆహుతులీయ వలయును 6.3.12

ఇట్లు స్వాహా శబ్దములతో
యజ్ఞమున ఆహుతులనిచ్చియు
మంథనుంచిన పాత్రలో ఘృత
శేష బిందువులుంచ వలయును 6.3.13

అగ్నిసోముల కాహుతనుచును
ప్రాణమునకును ఆహుతనుచు న
పానమునకును ఆహుతనుచును
వ్యానమునకును ఆహుతనుచును 6.3.14

బ్రహ్మమునకును ఆహుతనుచును
క్షత్రమునకును ఆహుతనుచును
భూతమునకును ఆహుతనుచును
భవిష్యత్తుకు ఆహుతనుచును 6.3.15

విశ్వభర్తకు ఆహుతనుచును
సర్వధర్తకు ఆహుతనుచును
ప్రజాపతికి ని ఆహుతనుచును
నేతి ఆహుతులీయ వలయును 6.3 16

అట్లు యజ్ఞము నందు ఆహుతు
లిచ్చి మిగిలిన నేతి చుక్కలు
'మంథ' నుంచిన పాత్రలోపల
శ్రద్ధతో విడువంగ వలయును 6.3.17

మంథ లోపలప్రాణములు భా
వించి, మంథను ప్రేమతో స్పృశి
యించి, యేకధ్యాన శీలుం
డగుచు నెంతయు పొగడ వలయును 6.3.18

''గాలి కైవడి తిరుగు దానవు
అగ్ని కైవడి వెలుగు దానవు
నిండు కుండగ ఉండు దానవు
నింగి కైవడి ఒప్పు దానవు 6.3.19

సృష్టి రూపంబైన సభకీ
వే సభాపతి వంటి దానవు
నీవె హింకారము ఘటింతువు
స్వయముగా హింకారమగుదువు 6.3.20

నీవె గానము చేయుచుందువు
నీవె గానము చేయబడుదువు
నీవె ధ్వనివై ఎసగుచుందువు
ప్రతిధ్వనివై అలరుచుందువు 6.3.21

జలములో గల అగ్ని వీవే
విభువునీవే ప్రభువు నీవే
అన్నమీవే జ్యోతివీవే
నాశమీవే సృష్టివీవే 6.3.22

నేను నీదగు గొప్పదనమును
విశ్వసింతును, నీవు నాకును
రాజు, వీశానుడవు, అధిపతి
వట్లు నన్నును చేయవలయును'' 6.3.23

ఇట్లు మంథను పొగడి, నాలుగు
గ్రాసములుగా చేసి దానిని
వరుసగా మంత్రములు చదువుచు
ప్రేమతో భుజియింప వలయును 6.3.24

[1]క్రమముగా 'గాయత్రి' 'మధుమాన్'
మంత్రములలో నున్న పాదము
లొక్కటొక్కటి చదివి గ్రాసము
లొక్కటొకటి గ్రహింప వలయును 6.3.25

మరియు [2]నాల్గవ గ్రాసమును 'గా
యత్రి' 'మధుమాన్' మంత్రములు సం
పూర్ణముగ స్వాహాంతములుగా
చదువుచును భుజియింప వలయును 6.3.26

మంథమున గావించు భావన
మూర్తరూపము నొందియుండును
కనుకనే 'నేనట్లునగుదు' న
టంచు భావన సేయువలయును 6.3.27

---

మొదటిగ్రాసం: 'తత్సవితుర్ వరేణ్యమ్' 'మధువాతాఋతాయతే మధుక్షరంతి సింధవః, మాధ్వీర్ నః సంత్వోషధీః, భూః స్వాహా'
రెండవగ్రాసం : 'భర్గోదేవస్యధీమహి' మధునక్తముతోషసో మధుమత్ పార్థివం రజః మధుద్యౌరస్తు నః పితా భువః స్వాహా'
మూడవగ్రాసం : 'ధియో యోనః ప్రచోదయాత్'
'మధుమాన్ నోవనస్పతిః. మధుమా అస్తు సూర్యః మాధ్వీర్ గావో భవంతునః. స్వః స్వాహా'
2. నాల్గవగ్రాసం : సంపూర్ణగాయత్రి, మధుమాన్ మంత్రములు.

చివర 'భూర్భువః స్వః స్వాహా'
యనుచు నాచమనమ్ము చేసియు
తూర్పు దెస తలనుంచి, అగ్నికి
పడమరగ నిద్రింప వలయును 6.3.28

లేచి నిద్దుర, ప్రొద్దుకెదురై
''దిశలలో కమలాని వీవై
వెలుగు నట్లుల నేను నరులలో
వెలుగ వలె'' నని కోర వలయును 6.3.29

తిరిగి అగ్నికి పశ్చిమమ్మున
చక్కగా కూర్చుండి, ధ్యానము
సేయవలె ఈవిద్యగురుశి
ష్యుల పరంపర కెట్లు వచ్చెనో 6.3 30

అరుణపుత్రుండైన ఉద్దా
లకుడు పూర్వము శిష్యుడగు ఆ
యాజ్ఞవల్క్యుని కెలమితో బో
ధించి నాడీ మంథ విద్యను 6.3.31

క్రమముగా ఈ మంథ విద్యను
యాజ్ఞవల్క్యుని పిదప నేర్చిన
వారలెందరో గలరు, వారల
లోన ముఖ్యుడు సత్యకాముడు 6 3.32

మంథ విద్యా రహస్యమ్మును
శిష్యులకు బోధించి గురువులు
పుత్రులకు బోధించి జనకులు
లోకమందున వాసికెక్కిరి 6.3.33

ఎవ్వడీ మంథమ్ము చేగొని
శిథిలమగు స్థాణువున చల్లిన
అదియు నెంతయు చిగురువేయును
కొమ్మలాకులు పుట్టుకొచ్చును 6.3.34

మంథ కర్మము నందు తప్పక
మేడిగరిటెయు, మేడి పాత్రయు
మేడి సమిధలు, మేడి కవ్వము
లుండ వలెనని శాస్త్రవచనము 6.3 35

వడ్లు, యవలును, తిలలు, మినుములు
సజ్జలును, మరి ప్రియంగువులును
గోధుమలు, చిరుసెనగ పప్పులు
బటానీ, ఉలువలును కావలె 6.3.36

చక్కగా దశధాన్యములతో
పిండి చేసియు, పెరుగు, తేనెను
నేతినెంతయు కలిపి, నేతితొ
హోమమును చేయంగవలయును 6.3 37

మంథకర్మను లోకమందున
శ్రద్ధతో ఘటియించు వారలు
ప్రకృతి శక్తుల తృప్తి పరచుచు
ఇష్ట సుఖములు బడయు చుందురు 6.3.38

